# ఇండోనేషియా

విద్వాన్ - విశ్వం.

ప్రజాశక్తి ప్రచురణాలయం
: బెజవాడ :

# 1. ప్రస్తావన

డచ్చి సామ్రాజ్యతత్త్వం క్రింద నాల్గు శతాబ్దాలు నానాబాధలుపడి నలిగిపోయింది ఇండొనేషియా. జపాను ఫాసిస్టు దురాక్రమణదారులు దాడి చేసేసరికి అంతవరకు ప్రజలను పీల్చి పిప్పిచేస్తున్న డచ్చిసామ్రాజ్యవాదులు తోకముడిచారు. అందుచే ఫాసిస్టు కఱకు రక్కసుల కోఱల్లో చిక్కి ఇండొనేషియా దారుణకృత్యాలకు గురిఅయింది.

వీటన్నిటికి ఇండొనేషియా ప్రజ స్వస్తిచెప్పదలచుకుంది. ప్రజానాయకులైన డాక్టర్ సోకర్నో, హట్టాల ఆధ్వర్యంక్రింద ప్రజలందరు సంఘటితులయ్యారు. జపాను రాక్షసులను తరిమివేశారు. స్వతంత్రాన్ని ప్రకటించారు.

యథాప్రకారం తిరిగి ఇండొనేషియాను, తన వలసరాజ్యంగా చేసుకొని పీడిస్తామని డచ్చి సామ్రాజ్యవాదులు తలిచారు. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల సహాయంతో ప్రజా స్వాతంత్ర్య పోరాటాన్ని విచ్ఛిన్నం చేసేందుకు తమ పశుబలాన్ని ఉపయోగించసాగారు. భారతదేశ ప్రజానీకం, తమ తోడి ప్రజల స్వతంత్ర పోరాటానికి సానుభూతిని ప్రకటించింది. బ్రిటన్ భారతసేనలను ఇండొనేషియా స్వతంత్ర సైనికులపై ఉపయోగించడం తీవ్రంగా ఖండించింది.

అయినా సామ్రాజ్యవాదులు తమ దుర్ణయాలనింకా ఆపలేదు

ఇండొనీషియా స్వతంత్ర పోరాటమింకా నడుస్తూంది ప్రజలు ఉద్యమాగ్నిలో ఉక్కుదేరి స్వతంత్రం సాధించేందుకు స్థిరనిశ్చయులై ఉన్నారు. వారి పోరాటం విజయవంతం కావడం అసలు సామ్రాజ్యతత్వానికే పెద్ద దెబ్బ. కాబట్టే భారత ప్రజలు ఇండొనీషియా స్వతంత్ర పోరాటంపై అత్యంత సహకార సానుభూతులను ప్రకటిస్తున్నారు.

నెహ్రూ తాత్కాలిక ప్రభుత్వం, ఇండొనీషియా రిపబ్లిక్కును ఆచరణలో గుర్తిస్తున్నామని ప్రకటించింది. అక్కడ దుర్వినియోగపడుతున్న భారతసేనను వెనక్కి పిలిపిస్తానని ప్రకటించింది.

ఈ ప్రకటనలను అమలుజరపాలి. వెంటనే మన సోదర ప్రజా స్వామిక ప్రభుత్వంతో స్నేహ సంబంధాలు పెట్టుకోవాలి. అక్కడ బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పెత్తనంక్రింద స్వతంత్రవాదులపై తుపాకులు కాలుస్తున్న పది వేల భారత సేనను వెనక్కురప్పించాలి. అందుకై ప్రతి ప్రజా స్వామ్యవాదీ ఆందోళన చెయ్యాలి.

ఆ ఇండొనీషియా ప్రజా పోరాటాన్ని మనం సమగ్రంగా అర్థం చేసుకోవాలి. అప్పుడే మనం బలపరచ గలుగుతాం. ఆ పోరాటాన్ని సంగ్రహంగా వివరించడానికి ఇక్కడ ప్రయత్నిస్తాను.

## 2. డచ్చి రాక్షస పాలన

జావాలో రెండో శతాబ్దిలో భారతీయులు ప్రవేశించారు. 13 శతాబ్దిలో అరబ్బులు పాదం పెట్టారు. 1509 లో బుడతకీచులు కాలు మోపారు. అనాదిగా చైనీయులక్కడ నివసిస్తూనే ఉన్నారు. 1602 లో స్థాపించిన డచ్చి ఈస్టిండియా కంపెనీ పక్షంగా జాన్ పీటర్సు అనే డచ్చివాడు జావాలో తావు కల్పించుకొన్నాడు.

జాన్ పీటర్సు ప్రవేశించేప్పటికి జావాలో పశ్చిమం వైపున ఉన్న బాంతం అనే చోట, పోర్చుగీసులు ఒకవర్తకస్థానం ఏర్పరచు కొన్నారు. అప్పటికి జావాలో కేంద్ర ప్రభుత్వంలేదు. చిన్న చిన్న రాజులు దేశమంతటా నిరంకుశంగా రాజ్యాలేర్పాటుచేసుకొని పాలిస్తున్నారు. వీరుసదా పరస్పర యుద్ధాలతో దేశాన్ని గందరగోళపరుస్తున్నారు. ఈ రాజ్యాలు ముఖ్యంగా మూడుచోట్ల ఉండేవి. వాయవ్య జావాలో చెరిబాన్‌లో ఒక రాజు, మధ్యజావాలో మాతరం, అనేచోట ఒక రాజు. బాంతంలో ఒకడు.

దేశంలో ముఖ్యమైనవి మూడు జాతులుండేవి. పడమట శుండానీయులు, దక్షిణంలోను, మధ్యప్రాంతంలోను జావనీయులు, తూర్పున మదురేయులు. ఈ ద్వీపంలో 41 ప్రత్యేక భాషలున్నవి. కాని మొత్తం మీద అందరికి సామాన్యభాష లాగ్‌మలేష్ అనే భాష. ద్వీపమంతా వాడుకలో ఉంది. ఈ భాష సుమత్రా దీవినుండి వచ్చినది.

వ్యాపారమంతా అరబ్బుల, చైనీయుల చేతిలో ఉన్నది. ఏకాస్తో పోర్చుగీసువారు దొరకబుచ్చు కోగలిగారు. ప్రజల ముఖ్య వృత్తి చేపలు పట్టడం, వ్యవసాయమున్నూ. అరబ్బులు, హిందూ దేశీయులు ప్రవేశపెట్టిన విద్య కేవలం, పాలక, పురోహిత వర్గాలలోనే ఉండి పోయింది.

జాన్ పీటర్సు జావాదీవిలోఉన్న సహజ సంపత్తిని చూచి మురిసి పోయాడు. ఇదే దొరికితే హాలండుకు కావలసినంత రబ్బరు, తేయాకు సింకోనా, కోకో, మిరియాలు, చక్కెర, ఇనుము, బొగ్గు, సత్తు, బంగారు, వెండి సంపాదించవచ్చు గదా అని ఎలాగో జావాను ఆక్రమించు కోవాలనుకున్నాడు.

1603 లో బటేవియాలో జాన్‌పీటర్సు వర్తకస్థానం స్థాపించాడు. డచ్చిపనివారి రక్షణకంటూ ఒకసేనానివేశం ఏర్పరిచాడు. త్వరలోనే రాజకీయాల్లో జోక్యం తీసుకున్నాడు. శాంతియుతంగా వ్యాపారం జరుపు కొనే అవకాశంకోసం ప్రయత్నిస్తున్నానంటూ యుద్ధాలుకూడ మొదలు పెట్టాడు. ఈ యుద్ధాలలో. ఒకడి తర్వాత ఒకడుగా రాజులు నేల పాల య్యారు.

ఇలా 150 ఏళ్ళలో డచ్చివారు, జావాలో అధిక భాగానికి, మొల్లుకా, పాలెంబాంగు దీవులకు అధిపతులై కూచున్నారు.

1825-30 లో డచ్చివారు సుమత్రావైపు తమరాజ్యం ముందుకు సాగారు. బ్రిటన్‌తో డంకలన్ అనే ప్రధాన వ్యవసాయకేంద్రం పుచ్చు కొని, సుమత్రాను పాదాక్రాంతం చేసుకున్నారు. అదేమంత కష్టసాధ్య ముగాకూడా కనిపించలేదు.

డచ్చివారిని ఎదుర్కొన్న ఆఖరు రాజు దీపనగర్. ఈ వీర కుమా రుని చరిత్రము ఈరోజుకూడ ప్రజలు స్మరించి పులకించి పోతుంటారు. డచ్చి సామ్రాజ్యవాదులీయన్ను మోసంతో పట్టుకున్నారు. డచ్చిసేనాని సంధి సంప్రతింపులకని ఇంటికి రప్పించి తల నరికివేశాడు.

ఆఖరుకు దేశీయుల పాలనక్రింద మిగిలిఉన్న ఆట్జేను 19 శతాబ్ది ఆఖరుకు డచ్చివారు ఆక్రమించుకొన్నారు. డచ్చి నౌకలను దోచుకొన డానికి ప్రయత్నిస్తున్నారని ఆట్జేప్రజలపై అపవాదుమోపి, ఆసాకుతో ఆప్రాంతాన్ని కాజేశారు. ఆట్జేప్రజలు విదేశీయులకు, ముఖ్యంగా టర్కీకి

సాయపడమని విజ్ఞప్తి చేశారు. కాని లాభం లేకపోయింది. అప్పుడు పెద్దరాజ్యాలన్నీ, తమ తమ వలసదేశాలను అదుపాజ్ఞల్లో ఉంచుకొనేందుకు తీవ్రంగా పనిచేసుకుంటున్నాయి. ఇతరులసంగతి వారికి అక్కరలేకపోయింది.

ఆల్టే ఆక్రమణతో డచ్చి ప్రభుత్వం ఇండోనేషియాకు సార్వభౌమత్వం సంపాదించింది. ఇక ఈ వెనకబడిన అమాయిక ప్రజలను దేశ సంపదను తాము దోచుకొనేందుకు వీలుగా పరిపాలించడానికి డచ్చి సామ్రాజ్యవాదులు పూనుకున్నారు

దేశీయులపై తమ సభ్యతను బలవంతంగా డచ్చి ప్రభుత్వం రుద్దింది. ద్వంద్వ పరిపాలన ఏర్పరచింది. దేశంలోని జమీందార్ల ద్వారా డచ్చి అధికారులు పాలించసాగారు

తమకు దాసులుగా పనిచేసేవారి కేమో విలాసమయ జీవితం ప్రసాదించారు మిగత శ్రమజీవులందరు చాలి చాలని తిండితో జీవితావసరాలు కూడ తీరక నానా బాధలకు గురి కావలసివచ్చింది.

పన్నెండేళ్ళు ఇండోనేషియాలో నివసించిన ఒక అమెరికన్ ఇలా వ్రాశాడు ; "డచ్చివారు జావాలో ఒకవేపునుండి ప్రవేశించునప్పటికి మానవత్వం మరో దారిగుండా పారిపోయింది." డచ్చివా రుండే తానిక జావాకు వెళ్ళదలచుకోలేదని న్యూయార్కుకు వెళ్ళి ఈ అమెరికన్ తన పరిశ్రమ యజమానులకు చెప్పాడు. 350 ఏళ్ళల్లోను జావాలో డచ్చివారంటే ఆశియా వాసులకే కాక తమ తోటి తెల్లవారికి కూడ అసహ్యం కల్గింది.

డచ్చిపాలనక్రింద, ఇండొనేషియా ఎంత దురవస్థలో ఉందో ఈ క్రింది అంకెలే విశదంగా తెలియజేస్తాయి.

## రా జ్యాం గం

డచ్చిరాజు ఏర్పరచిన వైస్రాయి దేశానికంతా సర్వాధికారి. అతని కొక సలహాసంఘం ఉంటుంది. 1942 లో జపానువారు వచ్చేటప్పటికి ఈ సలహా సంఘంలో - ఇద్దరు డచ్చివారు, వైస్రాయి నియమించిన ఇద్దరు ఇండొనీషియన్లు ఉన్నారు. ఈ వైస్రాయే సర్వసేనాని కూడా.

ఇతను నియంతలానే సర్వాధికారాలతో నిరంకుశంగా పరిపాలన సాగిస్తాడు

1917 లో డచ్చివారు ప్రజాస్వామ్య సిద్ధాంతాలను అమలుజరుపుతున్నామంటూ ఓ చట్టం చేశారు. ఇండొనీషియాలో ఒక శాసనసభను- "మార్క్ రాడి" ఏర్పరచారు. కాని ఈ సభకు చట్టాలు చేసే అధికారం లేదు. ప్రజల అభిప్రాయాలతో ప్రభుత్వానికి సంబంధం ఏర్పరచడానికి ఈ సభను ఏర్పరచామని ఆ చట్టంలో డచ్చి ప్రభువులు రాయించారు. శాసనాలు చేయలేని శాసనసభ ! ఎంత మోసం ! !

ఈ శాసనసభలో 30 ఇండొనేషియన్లు, 25 డచ్చి, 5 గురు మిగత ఆశియావాసులు మొత్తం 60 మంది సభ్యులుంటారు. అందులో 10 డచ్చివారిని. 10 ఇండొనేషియన్లను, 2 ఇతర ఆశియావాసులను, మొత్తం 22 మందిని వైస్రాయి స్వయంగా నామినేట్ చేస్తాడు : మిగతా 38 మంది సంకుచిత పరోక్షఓటింగుపద్ధతిలో ఎన్నుకోబడతారు. ఈ శాసనసభ ఏటా రెండుతూర్లు — ఒకతూరి బడ్జెట్‌ను ఆమోదించేందుకు, మరొకతూరి మిగత విషయాలను చర్చించేందుకు సమావేశమవుతుంది.

సమస్త ప్రభుత్వశాఖలమీద వైస్రాయిదే ఆధిపత్యం. ఇందులో డచ్చి సి ఐ. డి శాఖ అతి ప్రధానమైంది. ఈ శాఖ ఉద్యోగులు ప్రతి సభల్లోను పాల్గొంటారు. ఏ సభనైనా ఆపివేయడానికి, ఏ ఉపన్యాసకునైనా మాట్లాడవద్దని ఆదేశించడానికి వీరికి అధికారం ఉంది.

డచ్చి చట్టాలు ప్రజాస్వామ్యసూత్రాలకు చుక్కెదురు. కార్మికిల సమ్మెను ఉపన్యాసంద్వారా, లేక రచనద్వారా, లేదా చిత్తరువుద్వారా రెచ్చగొట్టారని ఎవరినైనా ప్రభుత్వం భావిస్తేసరి - వానికి అయిదేండ్లు శిక్షగాని, 50 పౌన్ల జరిమానాగాని డచ్చిచట్టంప్రకారం విధించవచ్చును.

ప్రజల (అంటేప్రభుత్వమనేగా)శాంతికిభంగకారులనిప్రభుత్వంఎవరినైనాభావిస్తే, అలాంటివారిని ఒకప్రత్యేక ప్రదేశానికి ప్రవాసంపడానికి మరోచట్టం అవకాశంకల్పిస్తుంది. ఈప్రవాసానికి కాలపరిమితి కూడ లేదు. ఈశిక్షచెప్పడానికి ఏకోర్టునిబంధనల ప్రకారంకూడ విచారణజరగవలసిన అక్కరలేదు.

ఇండొనేషియా రాజకీయఖైదీలను ఉంచేందుకు, రెండుకాంపు

లనుడచ్చి ప్రభుత్వం ఏర్పరచింది. డిగోనదిపైతీరంలో డచ్చిన్యూగినీ లోని తనమర, తనటింగి అనేకావుల్లో ఈకాంపులున్నవి. ఈకాంపుల్లో 1931 లో 1,321 ఇండొనీషియన్‌రాజకీయ ఖైదీలున్నారు. 1932 లో 842; 1933 లో 636; 1934 లో 631; 1935 లో 646; 1936 లో 697; 1937 లో 699; 1938 లో 606; 1939 లో 627 - ఈ కాంపుల్లో ఉన్నారు. అంటే ఈ కాంపుకు వెళ్ళిన ఏ రాజకీయ ఖైదీకూడ వెనక్కు రావడమనేది లేదు. ఆ పచ్చికబయళ్ళలో పడి చావ వలసిందే. ఆఖరుకు మృతఖైదీకి సోదరఖైదీలు అంత్యసంస్కారాలు చేయాలనుకున్నా నేరమే.

మొన్నటి యుద్ధంలో హాలండియాను విమోచనంచేస్తూ, ఆస్ట్రేలియన్లు ఈఖైదీఁలో చాలమందిని విడుదల చేశారు. పదిహేడేళ్ళ వారి జీవితాలు ఆచావుకాంపుల్లో నేలపాలయ్యాయి. విడుదలవుతూనే వారందరు జపాను వ్యతిరేకయుద్ధంలో అత్యుత్సాహంతో పనిచేశారు. కాని తిరిగి ఆ ఖైదీలను డచ్చివారు తిరిగి అప్పగించమన్నారు. ఆస్ట్రేలియన్లు తిరిగి పంపించివేయగా, ఆరాజకీయ ఖైదీలను ఆకాంపులకే పంపుతున్నారని ఇపుడు వార్తలు వస్తున్నవి అందుకే ఇండొనేషియన్లు నేడీ నినాదమిస్తున్నారు. "తిరిగి వలసదేశం కావడంకన్నా నరకానికి వెళ్ళడం మేలు"

యూరపియన్లను విచారి చే కోర్టులు వేరుగా ఉన్నవి. ఈ కోర్టులకు అధికారాలు ఎక్కువ. ఇండోనేషియన్లను విచారించే కోర్టులువేరు. వీనికి దిక్కులేనన్ని అధికారాలున్నాయి.

1878 చట్టప్రకారం, డచ్చివారియెడ అమర్యాదగా ప్రవర్తించినా ఇండోనేషియన్‌లకు శిక్ష విధించవచ్చు డచ్చివానిని డచ్చి భాషలో మాట్లాడించడంకూడ అమర్యాదే. ఆ నేరానికి మూడేండ్ల శిక్ష, కొరడా దెబ్బలు విధించవచ్చు.

డచ్చిన్యాయస్థానంముందు ఆశియావాసి నిలుచోరాదు ఓ వెదురు చాపమీద కూలబడాలి. 1926 లో ఒక చైనీయుడు అలా కూచో నిరాకరించినందుకు కొరడా దెబ్బలు తినవలసి వచ్చింది.

వందఏండ్ల క్రితంవరకు డచ్చివాని కెదురుగా ఆశియావాసి దారిలో వెళ్ళడానికి సాహసించేవాడుకాదు. ఇలాంటిచట్టం లేకున్నా, 1942 లో

జపానువారువచ్చేదాకా ఏ స్థాయికి చెందినవాడైనా డచ్చివానికి ముందు దారివిడవాలని ప్రభుత్వం ప్రజలకు సలహా ఇస్తుంది.

## సహజసంపద

గత పది సంవత్సరాలు సగటున లెక్కవేస్తే, ఇండొనేషియా నుండి హాలెండుకు సగటున ఏటా 3 కోట్ల 20 లక్షల పౌన్ల ఆదాయం వెడుతుంది. 1939 లో మొత్తం ఎగుమతుల్లో 61 % హాలండుకు వెళ్ళింది. దేశీయ సహజసంపదలో అత్యున్నత వర్గానికి ఇండొనేషియా చెందుతుంది. ప్రపంచం యావత్తు మిరియాల ఉత్పత్తిలో నూటికి 92 వంతులు ఈదేశంలో పండుతుంది. ప్రపంచంమొత్తం సింకోనాలో 91. 1. % ఇనుము అల్యూమినిం ఆక్సైడస్‌గల బాక్సైట్ అనే లోహం ప్రపంచోత్పత్తిలో 80 వంతులు ఇండొనేషియాదే.

అలాగే ప్రపంచం మొత్తం ఉత్పత్తిలో కాపల్ 77%; తేయాకు 19%; కోకో 29%; సత్తు 20%; నార 33%; చక్కెర 5%; నూనె 2. 5%. తగినంత బంగారు, వెండి ఇండొనేషియాలో చిక్కుతుంది.

1940 లో ఇండొనేషియా 7,934,000 టన్నులు క్రూడాయిల్ ఉత్పత్తి చేసింది. అంటే నూనె ఉత్పత్తిచేసే దేశాల్లో అయిదోస్థానం ఆక్రమించింది.

వ్యవసాయ పదార్థాల ఎగుమతిలో నూటికి 69 3 పాళ్ళు డచ్చి వారి అధికారంక్రిందఉన్న పొలాల్లోనే పండేవి. ఎగుమతయే చక్కెరలో 99. 4 పాళ్ళు, తేయాకు 81. 9 పాళ్ళు డచ్చివారి పొలాల్లోనే పండేవి. కొబ్బరి, కాపల్ మాత్రం దేశీయులు పండించేవారు.

దేశీయుల చేతిలోఉన్న 30. 7 పాళ్ళు ఉత్పత్తికూడా ఇండొనీషియన్లు తమ కిష్టంవచ్చినట్లు ఎగుమతిచేసుకో వీలులేదు విదేశ గుత్త వ్యాపారులు ఎగుమతి వ్యాపారమంతా చేతనుంచుకొన్నందువల్ల, వారు చెప్పిన ధరలకు అమ్ముకోవలసి వచ్చేది.

1940లోఇండొనీషియానుండిఎగుమతులు 881,913,000పౌ॥లు, దిగుమతులు 437,678,000 పౌ॥లు. అంటేఎగుమతుల్లో సగం మాత్రమే దిగుమతయ్యేవి. అందులోను దిగుమతులు ఎక్కువ భాగం యూరపియన్ల కోసమే.

ఆస్ట్రేలియా కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి డిక్సన్ వ్రాసిన వ్యాసంలో యుద్ధానికి ముందు సంవత్సరం, ఇండొనీషియా 22 కోట్ల 50 లక్షల పౌన్ల వస్తువులు ఎగుమతి చేసిందనీ, 12 కోట్ల 50 లక్షలు పౌన్లు దిగుమతి చేసుకుందని తెలిపాడు. 1938-39 లో ఆస్ట్రేలియా 11 కోట్ల 40 లక్షల పౌన్ల వెలగల వస్తువులు దిగుమతి చేసుకుంది. ఆస్ట్రేలియా జనాభా కన్నా ఇండొనీషియా జనాభా పదింతలెక్కువ మరి.

జ నా భా

1939 లో జనసంఖ్య లెక్కలు తీసుకున్నారు. దాని ప్రకారం ఇండొనేషియా మొత్తం జనాభా 6 కోట్ల 7 లక్షల 27 వేలు. ఇందులో 5 కోట్ల 91 లక్షల 38 వేలు ఇండొనేషియన్లు, 240000 మంది యూరపియన్లు. 123,000 చైనావారు, 116,000 మంది ఇతర ఆశియా వాసులు.

ఆశియావాసులకు లేని ప్రత్యేకహక్కులు యురపియన్లకున్నాయి. ఫార్మసీలు పెట్టుకునే హక్కు ఆశియావాసులకు లేదు. డచ్చివారు జపాన్ జాతికి మాత్రం యూరపియన్లకున్న సౌకర్యాలన్నీ ఇచ్చారు. వస్తూ పోతూ ఉన్న ఆశియావాసులు, యూరపియన్ల స్థాయిని పొంద వీలుంది. కాని అందుకు కొంత తతంగముంది. ముగ్గురు యూరపియన్లు ఇతనితో సమానహోదాతో వ్యవహరిస్తున్నట్టు సర్టిఫికేట్లివ్వాలి. అందుతో పాటు వెయ్యి గల్డెన్‌ల ఫీజు అచ్చుకోవాలి. (గల్డన్ అంటే రు 1-12-0,

మొత్తం రెండు లక్షల 40 వేల మంది యూరపియన్లలో, రెండు లక్షల 8 వేలమంది డచ్చివారే. (ఇందులో యురేషియన్లున్నారు. వీరికీ డచ్చివారికున్న ప్రత్యేక సౌకర్యాలన్నీ ఉన్నాయి.) 7195 మంది జపానువారు, 7,397 మంది జర్మన్లు, 2,414 ఇంగ్లీషువారు, 790 స్విస్, 643 అమెరికన్లు, 214 ఫ్రెంచి, 282 ఫిలిప్పైన్లు, 238 రష్యన్లు. 186 ఇటాలియన్లు 132 పోలెండ్‌వారు, 130 టర్కీవారు, 127 మంది జెక్కులు, 110 హంగేరియన్లు. 9947 మంది యురపియను స్థాయికి చెందిన ఇండొనేషియన్లు దేశంలో నివసిస్తున్నారు

చదువు సాములు

మొత్తం జనాభా 6 కోట్ల 7 లక్షల 27 మందిలో 4,296,579

మందికి చదువువచ్చు. ఇందులో ఇంకొంత వివరంగా చూదాం: ఆ చదువు వచ్చినవారిలో ఇండొనేషియన్లు 37,46,000 మంది. అంటే జనాభాలో నూటికి 6.4 వంతుమాత్రం. మరి యూరపియన్లుమట్టుకు నూటికి 75.2 వంతులు అక్షరాస్యులే; చైనీయులు నూటికి 28.9 వంతులు చదువు వచ్చినవారు. మిగత ఆశియావాసుల్లో 22.4% పాళ్ళు చదువుకున్నవారు ఇవన్నీ మొత్తం లెక్కవేస్తే దేశం జనాభాలో నూటికి ఏడుగురికి మాత్రం చదువు వచ్చునన్నమాట.

1939 లో ప్రతి పదకొండుమంది బాలబాలికలకు ఒకరు మాత్రం బడికి వెడుతున్నారు మొత్తం విద్యాశాఖకు ప్రభుత్వం జనాభాలో తలకు 8 అణాలమాత్రం వెచ్చిస్తూవచ్చింది.

ఇండొనేషియన్లకు విధిగా చదువుకోవాలన్న నియమం లేదుకాని, అక్కడున్న డచ్చి పిల్లలకుమాత్రం చదువు విధిగా ఉచితంగా చెప్పే ఏర్పాట్లున్నవి. ఇండొనేషియన్ బాలబాలికలు బడికి వెళ్ళాలంటే డచ్చి ఉద్యోగులు ముందుగా వారి తలిదండ్రుల రాజకీయాభిప్రాయాలు తెలుసుకొని ఫర్వాలేదని సర్టిఫికెట్ యివ్వాలి. ఎంతో జీతం యిచ్చుకుంటే, ఆ సర్టిఫికెట్ ఉంటే అప్పుడుమట్టుకే ఇండొనేషియా విద్యార్థులను సెకండరీగ్రేడు స్కూళ్ళలో చేర్చుకుంటారు.

## ఆదాయంలో భాగాలు

900 గల్డన్లు (1,675 రూ) ఏటా ఆదాయంకన్నా మించితే ఆదాయపన్ను విధిస్తారు ఇంతకులోపడి ఎంత సంపాదించినాసరే, తేయాకుతోటల్లో దినానికి 0-14-0 కూలి. తెచ్చే కూలితోబాటు తనకు వచ్చే అసలు జీతంలో నూటికి నాలుగు రూపాయలు ప్రభుత్వానికి పన్ను కట్టాలి.

డచ్చి ప్రభుత్వం నియమించిన హెన్డార్ కమిషన్ నివేదిక ప్రకారము 1939 లో సగటు ఇండొనేషియన్ ఆదాయం దినానికి తలకు 9 పైసలు.

1939 లో మొత్తం ఆరుకోట్ల ఇండొనేషియన్లలో 36 వేలమంది మాత్రం ఆదాయపన్ను చెల్లిస్తున్నారు. మరి 2 లక్షల 40 వేలమంది యూరపియన్లలో 70,625 మంది ఆదాయపన్ను చెల్లిస్తున్నారు అంటే

ఇండొనేషియన్లు నూటికి 3.05% మాత్రం 1,675 రూపాయలకు పైన ఆదాయం వచ్చేవారున్నారు యూరపియన్లలో నూటికి 32 మంది పెద్ద ఆదాయాలు వచ్చేవారున్నారు అన్నమాట.

ఇంకా అంతకన్నా ఎంతెంత ఆదాయం ఎవరెవరికి వస్తున్నదో వివరంగా చూదాం. 1939 సం॥ లెక్కల ప్రకారం ఈ క్రింది విధంగా తేలుతుంది.

| గ్రూపులు | ఇండోనేషియన్లు | యూరపియన్లు | మిగత ఆశియా |
|---|---|---|---|
| 60,000 - 1,80,000 గల్డన్లు ఏటా ఆదాయం వచ్చేవారు | 2 | 72 | 22 |
| 30,000 - 60,000 గల్డన్లు ఏటా ఆదాయం | 8 | 400 | 97 |
| 12,000 - 30,000 | 140 | 3,924 | 699 |
| 6,000 - 12.000 | 577 | 13,135 | 2 298 |
| 3,000 - 6 000 | 3,667 | 22,208 | 7,320 |
| 1,200 - 3,000 | 9 990 | 25,742 | 26,897 |
| 900 - 1,200 | 19,621 | 5,931 | 10,241 |

ఈ పట్టికను బట్టి చూస్తే అధికలాభాలు గడిస్తున్నవారు యూరపియన్లని తేటతెల్లమవుతుంది.

## మత పక్షపాతం

కాథిలిక్ ప్రొటెస్టాంటు క్రైస్తవ మిషన్లకు ఇండొనేషియాలో పెద్ద మొత్తాలను ప్రభుత్వం ఇస్తూ వచ్చింది. ఇంకే ఇతర మతసంస్థలకు ఈ సహాయం ఇవ్వడం లేదు.

మొత్తం ఇండొనేషియాలో మత సంఖ్య 5 కోట్ల 80 లక్షల ముస్లిములు; 20 లక్షల క్రైస్తవులు; 30 లక్షల పతాన్లు; 12½ లక్షల హిందువులు (ఒక ద్వీపంలో) ఉన్నారు.

ఇండొనేషియన్లలో కేవలం 25,608 మందికి మాత్రమే (మొత్తం జనాభా 59,138,000) రేడియోలున్నట్లు 1939 లెక్కలు తెలుపుతున్నవి. మరి రెండు లక్షల 40 వేలమంది యూరపియన్లలో 45,039 మందికి

రేడియోలున్నవి. పైగా ఆశియావాసులు రాత్రి 11 గంటలకు సరిగ్గా రేడియోలు మూసిపెట్టాలి.

## ప్రజా సౌకర్యాలు

మొత్తం జనాభాకంతటికి 693 మంది డాక్టర్లు, 157 మంది దంత వైద్యులు, 104 ఫార్మసీలు, 280 మందులషాపులు ఉన్నవి. వెయ్యికి ఏటా 28% చొప్పున పుట్టుకలున్న ఆ దేశంలో, కేవలం 109 మంది ప్రభుత్వ మంత్రసానులు మాత్రమున్నారు. 116 మంది మంత్రసానులు మునిసిపల్ కౌన్సిళ్ళక్రింద, 476 మంది స్వంతంగా పనిచేసేవారు ఉన్నారు.

ఇక మందులషాపులు కేవలం యూరపియన్లు మాత్రమే నడుపుతారు. వారు రాత్రి 11 దాటితే ఆశియావారికి ఏమందూ ఇవ్వరు. అప్పుడు మందు కావాలంటే యూరపియన్ డాక్టర్ సర్టిఫికేట్టుండాలి. మరి ఆ డాక్టరు ఒక్కతూరి ఇంటికిరావాలంటే 50-100 గల్డన్లు ఇవ్వాలి కాబట్టి ఏ పెద్ద డబ్బుగలవారికో తప్ప ఈ సౌకర్యంకూడ దొరకదు.

డచ్చి సామ్రాజ్యవాదుల రాక్షస పాలన క్రింద, ఇండొనేషియా ఎంత దుస్థితిలో ఉందో ఇంతవరకు చూపిన లెక్కలద్వారా మనకు అవగత మవుతుంది.

# 3. నవయుగోదయం

డచ్చివారిస్థానే ఇండోనేషియాను, జపాను 1942 మార్చి 8 వ తేదీ ఆక్రమించింది. డచ్చివారు అప్రత్యాగంచేసి 'జితోస్మి' అన్నారు. బేషరతుగా లొంగిపొయ్యారు. డచ్చి సైనికులు ఒక్కతుపాకి పేల్చలేదు. కొందరు చిన్న చిన్న మిలటరీ ఉద్యోగులే ఈకార్యక్రమం సాగించారు. డచ్చియుద్ధనాయకులంతా అప్పుడే దేశంవదిలి బ్రదుకు జీవుడా అని వెన్నిచ్చి పారిపోయారు.

ఇలాగే, ఇండోనేషియాలో ఏర్పడిన డచ్చిసామ్రాజ్యం అంతమయింది.

కాని తమకు డచ్చివారు పూర్వంచూపిన సౌకర్యాలను జ్ఞాపక ముంచుకొని, జపానువారూ డచ్చివారికి కొన్నిసౌకర్యాలిచ్చారు డచ్చి పౌరులను స్థానభ్రష్టులను చెయ్యలేదు. వారికున్న యురపియన్లకున్న ప్రత్యేక హక్కులలాగే ఉంచారు. చాలమంది డచ్చివారిని గౌరవజపాను పౌరులుగా అంగీకరించారు.

ఇదంతా చూచి ఇండొనేషియన్లు అసహ్యించుకున్నారు. ప్రారంభంలోనేమో ఇండొనేషియన్లుకూడా జపానుతో సహకరించారు. కాని అదివేరు. ఆశియా ఆశియా వాసులకే అన్న జపాను నినాదం వారిని ఆకర్షించింది. కాని జపానుతో సహకరిస్తున్న డచ్చివారు కేవలం తమ స్వార్థంకోసమే అలాచేశారు. డచ్చి స్త్రీలు కూడ బహిరంగంగా జపాను ఉద్యోగులతో సరస సల్లాపాలు జరిపారు.

హాలండును జర్మనులు ఆక్రమించినపుడు, ఇండొనేషియన్లు దీపావళి ఉత్సవాలు జరిపారు. డచ్చి పోలీసులకు వారు భయపడలేదు ఆశియా ఆశియావాసులకే అన్న జపాను నినాదం శ్రావ్యంగా వినిపించింది ఎంతోఆశను రేకెత్తించింది స్వతంత్ర సాధనకు జపాను సానుభూతి చూపుతుందని కలలు గన్నారు. కాబట్టే మార్చి 8 (1945) జపాను సేనలు రాగానే తమ దాస్య విమోచకులని ఇండొనేసిషియా ప్రజలు భావించారు.

త్వరలోనే వారు నిరాశాహతులయ్యారు. జపాను మరో కొత్త రంగు విభేదం తీసుకొనివచ్చింది తెల్ల నల్ల విభేదంకాదిది. జపాను వారికంటె మిగతా అన్నిరంగులవారూ వారికి తక్కువే

జపాను ఆక్రమణరోజుల్లో, ఎన్నో షాపులు, హోటళ్ళు, భోజన శాలలు జపానేతరులకు ప్రవేశం నిషేధించాయి. డచ్చివారుమాత్రం గౌరవ తిథులుగా వెడుతూనే ఉన్నారు. జపానువారికోసమని కొన్ని ఆహారపదార్థాలు ప్రత్యేకం రిజర్వుచేసేవారు.

జపానుసైనికులు, డచ్చివారిని మర్యాదగా చూసేవారుకాని, ఇండొనేషియన్లను అతి నీచంగా చూచారు. కొందరిని అనవసరంగా కొట్టేవారు. ఎదిరిస్తే రాజద్రోహం.

జపానువారు యుద్ధకార్యాల్లో వేలమంది ఇండొనేషియన్లతో పని చేయించారు. జీవిత ప్రమాణం మూడంతలకుపైగా మించినా జీతాలు

మరీ అధ్వాన్నంగా యిచ్చేవారు. ఎందరో చాలీ చాలని కూలితో, రోగాలతో దిక్కులేని చావుచచ్చారు. ఉన్న డాక్టర్లందరిని జపాన్ సైనిక వైద్యాలయాలకు పిల్చుకొని పోయింది.

మంచిరకం దుస్తులన్నీ జపానువారివీ డచ్చివారివీనీ-మరొకరికవి అందుబాటులోలేవు. డచ్చి స్త్రీలు జపాను జరీవలువల్లో తళతళ మెరిశారు.

ఏది చూచినా జపాను మాయమవుతుంది. కాని ఇండొనేషియా సహకారం తమకు కావాలంటే, జాతీయభావం పెంపొందించాలని జపాన్ వారనుకున్నారు అయినా ఆ జాతీయత మరీ పెంపొందితే అసలు తమ ఉనికికే ఊనం వస్తుంది.. కాబట్టి అటూ యిటూ కాని మధ్యమార్గంలో జపాను ఉద్యోగులు ప్రవర్తించసాగారు. త్వరలోనే జపానువారిపై తమకున్న విశ్వాసం పూర్తిగా ఇండొనేషియన్లు వదులుకొన్నారు.

జపాను ఆక్రమణ, ఇండొనేషియన్ల దృష్టిలో కేవలం యజమానుల మార్పు మాత్రమే. ఏ యజమాని పరమ దుర్మార్గుడు అని చెప్పడం కూడ కష్టం బహిరంగంగా తిరుగుబాట్లు చేయడానికి కొందరుజంకారు. కొందరు సమయంకోసం వేచి ఉన్నారు అయినప్పటికీ రహస్యంగా జపాను వ్యతిరేక ఉద్యమం బాగా పెరిగింది. కొండల్లో కమ్యూనిస్టుల నాయకత్వంక్రింద గెరిల్లాసైన్యం తయారయింది. వీధుల్లో జపాన్ సైనికుల ఎదుటే ప్రజలు గుమిగూడి, ప్రజానాయకుల కార్యక్రమంగూర్చి సంభాషించుకొనేవారు. లండన్ టైమ్సువంటి కన్సర్వేటివ్ పత్రిక విలేఖరికూడ "జపాన్ ఆక్రమణ కాలంలో జాతీయ ఉద్యమం బ్రహ్మాండముగా విజృంభించింది." (అక్టోబరు 10, 1945) అని చెప్పాడు.

1943 ఏప్రియలో-జులైలలో జపానువ్యతిరేకోద్యమం బహిరంగంగా విజృంభించింది. దేశమంతటా తిరుగుబాటులు చెలరేగాయి. ఈ ఉద్యమం 1944 ఏప్రిల్‌లో ఉచ్ఛస్థితికి వచ్చింది. అప్పుడు డచ్చికి అనుకూలంగా కుట్ర సాగించారని పేరుపెట్టి జపానువారు 2000 మందిని ఉరి తీశారు

జపాను ఉద్యోగులు ఇండొనేషియాలోని వివిధ వర్గప్రజల్లోను విద్వేషాన్ని రెచ్చగొట్టారు. ఒక్క పేరుకెక్కిన క్విస్లింగు (దేశద్రోహి) కూడ ఇండొనేషియాలో కనిపించలేదని లండన్ టైమ్సు పత్రిక 1944

మార్చిలో వ్రాసింది. ఇండొనేషియా ప్రజలకు సైనిక తర్ఫీదునిస్తే, వారు జపానుజీవితాలకే ముప్పు తేవడం మొదలెట్టారు.

జపాను వ్యతిరేకోద్యమాన్ని రహస్యంగా నిర్మిస్తున్నవారిలో ముఖ్యులు డాక్టరు సోకర్నో డాక్టరు హట్టా అనేవారు మిగతావారిలాగే జపాను తొలుత వచ్చినప్పుడు సోకర్నో కాస్త ఆశపడ్డా, త్వరిలో అది పొరపాటని గ్రహించాడు ఆయన జపానువారికలా ఎదుట చెప్పలేదు. కాని, రహస్యంగా ప్రజాఉద్యమాన్ని బలపరుస్తూ వచ్చాడు.

జపాను పెరల్ హార్బరుపై దాడిచేసినప్పుడు, డాక్టరు హట్టా అంబోయినాదగ్గర బండోనీరాలో నిర్బంధితుడై ఉన్నాడు. అక్కడనుండే ఆయన ఇండొనేషియన్లను హెచ్చరిస్తూ ఒకజాబు రాశాడు. జపాను దేశాన్ని దోచుకొనేందుకే వస్తున్నదన్నాడు. బోసుమార్గం అనుసరించ వద్దన్నాడు. "భారత దేశంలో నెహ్రూను ఆదర్శంగా తీసుకోండి. ఆయనెప్పుడూ సామ్రాజ్యతత్వ వ్యతిరేకి-కాని ఎన్నడూ ఫాసిస్టుల నాజీల సాయాన్ని అపేక్షించలేదు అనిహట్టా వ్రాసాడు

ఏమైనా, జపాను దురాక్రమణవల్ల, ఇండొనేషియా ప్రజల్లో ఐక్యత చేకూరింది. అసంతృప్తి స్వతంత్రకాంక్ష మేరమీరింది. సమయం కోసం ఇడొనేషియా ప్రజలు చాలకాలం కాచుకో వలసి వచ్చింది. అచిరకాల వాంఛితం సమీపించింది. డచ్చివారు జైళ్ళలో ఉన్నారు. అక్కడ టోకియోలో మికాడో శరణన్నాడు అప్పుడు ఇండొనిషియన్లు ఆగస్టు 17, 1945 న తమ స్వతంత్రం ప్రకటించారు. జపాను సైనికు లను బంధించి నిరాయుధులను చేయసాగారు.

జగార్తాలో ఇండొనేషియా రిపబ్లిక్ నెలకొల్పారు. 350 ఏళ్ళ నుండి కంటున్న కలలు నిజమయ్యాయి. ఇండొనేషియా రక్షకభటులు వీధుల్లో సంచరించారు. జపానుసైనికులు తలవంచుకొని పారిపోయారు. జపాన్ ఆక్రమణ సమయంలో కొవ్వి బలసిన డచ్చివారు యూరపియన్ దేశాల సాయం కోరారు.

స్వతంత్ర రాజ్యాంగాన్ని ఒక వారం రోజులు వీధుల్లో గోడలపై ప్రకటించారు. మిగిలిన జపాను సేనలను నిరాయుధులనుగా చేయసాగారు. దీనితో ఇండొనేషియన్లు ఆనందంతో ఉప్పొంగి పొయ్యారు.

16A



షారీర్
ఇండొనేషియన్ రిపబ్లిక్ ప్రధాని

ముఖచిత్రం: వెదురు ఈటెలతోనే స్వాతంత్ర్య పోరాటం జరుపుతూన్న ఇండొనేషియా విప్లవ వీరుల సమావేశం.

కాని, డచ్చివారికి సాయంవచ్చింది. ఇండియన్ సేనాదళాధిపతి మల్లబీ వచ్చాడు ఇండొనేషియన్లపై బ్రిటన్ తలపడింది. కారణ మేమిటి? ఇండొనేషియా విప్లవకారులే నిరాయుధులచేసివేసిన జపాను సేనలను నిరాయుధులచేయడానికే వచ్చామని బ్రిటిష్‌వారన్నారు.

పోరాటం తీవ్రమైంది. బ్రిటన్ బహిరంగంగా ఇలా పోరాటానికి దిగకముందే వారి ఉద్దేశాలు బయటపడ్డాయి. జపాన్ కాంపులనుండి విడుదలయిన డచ్చి సైనికులకు బ్రిటన్ శిక్షణ ఇస్తున్నట్లు ఒక బ్రిటిష్ యుద్ధ ఖైదీచెప్పాడు. అక్టోబరు కల్లా (1945) పదివేల మంది డచ్చి సైనికులను, అడవుల్లో యుద్ధం చేసేందుకు ప్రత్యేక శిక్షణనిచ్చి, ఇండొనేషియాకు బ్రిటన్ పంపింది.

బ్రిటిష్ అధికారులు ఇండొనేషియాలో ప్రవేశిస్తూనే డాక్టర్ సోకర్నో ఫిర్యాదుచేశాడు బ్రిటిష్ సైనిక దుస్తులలోఉంటే నమ్మడం కష్టమని, డచ్చిసైనికులను బ్రిటిష్ దుస్తులతో తెస్తున్నారని బ్రిటిష్ సేనాధికారులకు చెప్పాడు.

నవంబరులో బటేవియాలో దిగిన బ్రిటిష్ సైనిక దుస్తులున్న వారిలో ఇద్దరు డచ్చి మలేభాషలు వచ్చిన వారని, ఇంకో యిద్దరు డచ్చి మాత్రమే వచ్చిన వారని, మరిద్దరు ఇంగ్లీషువారని ఒక అమెరికన్ చెప్పాడు.

"మాకు బ్రిటన్‌తో పోరాడాలని లేదు. కాని మీతో పోరాడు తున్నవా రెవరో మాకు తెలియాలి" అని సోకర్నో బ్రిటిష్ అధికారులకు చెప్పాడు.

కేవలం జపాన్ సైనికులను నిరాయుధులను జేసేందుకే వస్తున్నా మని పేరుచెప్పి. బ్రిటన్ డచ్చి సామ్రాజ్యవాదులను వెనకవేసుకొని, ఇండొనేషియా స్వతంత్ర పోరాటాన్ని పశుబలంతో విచ్ఛిన్నం చేయ దలచుకుంది.

# 4. స్వతంత్ర పోరాటం

ఇండొనేషియాలో తొట్టతొలుత ప్రజా ఉద్యమానికి నాందీ చేసిన వాడు ఒక రిటైర్డు గవర్నమెంటు డాక్టరు ఒక పాత గుడిసెలో ఇండో నేషియా మేధావులను కొందరిని చేర్చి ఆ డాక్టరు బోధించాడు. కేవలం డచ్చిని తిడితే లాభంలేదని, ప్రజల అవిద్య, అజ్ఞానాలను రూపుమాపడం కోసం తొలుత ప్రయత్నించాలన్నాడు.

మొట్టమొదట ప్రజాపక్షం "బుడిఉటామా"- అన్న పేరుతో 1908 లో స్థాపింపబడింది. ఆమ్‌స్టర్‌డామ్ విశ్వవిద్యాలయంలో పట్ట భద్రులై వచ్చినవారు చాలమంది అందులో చేరారు. ఆ పార్టీ రెండు ఆశ యాలు ప్రకటించింది ఇండోనేషియన్లందరికీ ఉచితవిద్య కావాలి: కార్మికులకు జీతాలు హెచ్చించాలి. 1910 కల్లా ఈ పార్టీలో 10,000 సభ్యులు, 20 వేలమంది సానుభూతిపరులు తయారయ్యారు. ఈ పార్టీ వ్యవసాయ కూలీలలోకి బాగా వ్యాపించింది. 1911 లో గ్రామాల్లో దీని బలం అత్యధికంగా పెరిగింది. పగలల్లా డచ్చి తేయాకుతోటల్లో పని చేసి, రాత్రిళ్ళు వ్యవసాయ కూలీలందరూ ఒకచోట చేరి, బటేవియా విద్యార్థి ఒకతను చెప్పే మాటలు వినేవారు ప్రత్యేకంగా వీరుచదువు నేర్చుకునేవారు

1910 లో మరింత తీవ్రఉద్యమం బయలుదేరింది. 'సారేకత్ - ఇ-ఇస్లాం' అనే పార్టీ పుట్టింది. దేశభక్తి మతంలో ఒకభాగమని ఈ పార్టీ ఆశయం, మత వివాదాలద్వారా వీరుప్రజలకు బోధించేవారు, ఈ పార్టీ. బుడిఉటమ కార్యక్రమాన్ని తన కార్యక్రమంలో చేర్చుకుంది. ఈ పార్టీ వారిని డచ్చి సైనికులు పదేపదే కొట్టేవారు. కొందరు డచ్చి ప్రభుత్వం తనమరా కాంపుకు ప్రవాసం పంపింది.

భారతదేశంలోలాగా ఇండొనేషియాలో ప్రత్యేకం దేశీయపెట్టు బడిదారి వర్గం బలపడలేదు. పరిశ్రమాభివృద్ధి జరగలేదు డచ్చిని మినహాయిస్తే మిగతా పెట్టుబడి పూర్తిగా జపాను, అరబ్బు, చైనా, భారతీయులు మొదలైన వారిచే గాని దేశీయులది లేదు డచ్చివారు సమానంగాచూస్తుండడంవల్లయురేషియన్లుకూడతామూ (మనఆంగ్లోఇండి యన్ల వంటిజాతి) ఇండొనేషియా పాలకులమే అనుకునేవారు.

ఇండొనేషియన్లు తమ సమస్యలను కార్మికసమస్యలుగా భావించారు రష్యాలోఉన్న సమస్యలే తమనుకూడ ఎదుర్కొంటున్నాయని భావించారు. సోవియట్ విప్లవం ఇండొనేషియన్లకు ఆశాజ్యోతిని చూపించింది. సోవియట్ విప్లవవీరులు తమకు ఆదర్శప్రాయులనుకున్నారు. తమ విప్లవానికి సోవియట్ విప్లవం మేలుబంతిగా నిశ్చయించుకున్నారు

1913 లో హాలెండు పై రాజభక్తిని ప్రకటించిన 'సాసీకత్ ఇ-ఇస్లాం' రష్యావిప్లవం తర్వాత "సంపూర్ణ స్వతంత్రం మా ఆశయం అని ప్రకటించింది. ఈ ఆశయం చట్టబద్ధపద్ధతులతో సాధించాలన్నారు. కాని ఆపద్ధతులు అసాధ్యమని రుజువయితే, ప్రజలకోసం, తమ మాతృభూమికోసం, ఎలాంటి త్యాగాలైనా చేస్తామని ఆ పార్టీ ప్రకటించింది. వర్గపోరాటంపై దృష్టిని కేంద్రీకరించింది.

1919 లో బటేవియాలో మొట్టమొదటి ఇండొనీషియా కేంద్ర కార్మిక వ్యవస్థ ఏర్పడింది. దాని శాఖలు దేశమంతటా ఏర్పడినాయి. కార్మికసంస్థలు 'విద్య, హెచ్చుకూలీలు' అనే బుడిఉటమా కార్యక్రమం తీసుకొని పనిచేయసాగారు. కార్మికసంఘాల కోర్కెలను డచ్చి అధికారులు త్రోసిపుచ్చడంతో సమ్మెల వెల్లువలా దేశాన్ని ముంచివేశాయి. అందులో ముఖ్యమైనవి. సెమరాంగు ఛెరిబన్ - ట్రాం కార్మికుల సమ్మె; సుమత్రా తూర్పుతీరం రైల్వే సమ్మె; సురబయా ముద్రాపకుల సమ్మె; కుట్టుపనివారి సమ్మె; ఆఖరున యూరపియన్ పెట్టుబడి ఎక్కువగల చక్కెర ఫ్యాక్టరీ కార్మికుల సమ్మె -తరంగాలులా వచ్చాయి

1920 లో ఇండొనేషియా కమ్యూనిస్టుపార్టీ స్థాపితమైంది. ఇండొనేషియాలోని తీవ్ర జాతీయవాదులందరినీ కమ్యూనిస్టులు సమీకరించారు. వివిధ పార్టీలను ఒకచోజేర్చారు. సమ్మెలు అలాగే సాగాయి. 1922 లో ప్రభుత్వ కుదవ అంగళ్ళలో (తాకట్టు పెట్టుకొని అప్పిచ్చేవి) జనరల్ సమ్మె వచ్చింది. తిరిగి 1923 లో రైళ్ళు మొదలైన ప్రయాణ సౌకర్యాలన్నీ ఆగిపోయే జనరల్ సమ్మె వచ్చింది వైస్రాయి దమననీతిని ప్రయోగించాడు ప్రజలు సభలు చేయరాదని నిషేధించాడు. కార్మిక సంఘాలలో పనిజేసేవారిని 'తనమరా' 'తనటింగి' కాంపులకు ప్రవాసం పంపుతానన్నాడు.

1923 లో 'సారేకత్ - ఇ - ఇస్లాం' స్థానిక శాఖలన్నిటిలోని కమ్యూనిస్టుల పలుకుబడి బ్రహ్మాండంగా అభివృద్ధిచెందింది. అందుతో గాభరాపడి సా- ఇస్లాంపార్టీ కార్యవర్గంలోని మితవాదులు కమ్యూనిస్టులను తొలగించాలన్నారు అందుతో సారే'త్-ఇ-మేరా' అనే పేర కొత్త సంస్థ ఏర్పడింది. ఈ సంస్థక్రింద కమ్యూనిస్టుపార్టీ దేశంలోని యావత్తు ప్రజానీకాన్ని కూడగట్టుకొని రాగలిగింది.

ఇండొనేషియాలో డచ్చి ప్రభుత్వానికి ఆయువుపట్టు ఎగుమతి వ్యాపారమని కమ్యూనిస్టులు గ్రహించారు. ఆ శాఖలో సమ్మెలు అతి వేగంగా వ్యాపించాయి 1925 లో చాల సమ్మెలు, బ్రహ్మాండమైన ప్రదర్శనాలు డచ్చి పరిపాలనా యంత్రాన్ని కదిపివేశాయి. 1926 నవంబరునుండి 1927 జనవరివరకు కమ్యూనిస్టు నాయకత్వంక్రింద ఉన్న దేశభక్తులకు; డచ్చి సేనలకు బహిరంగంగా జావా సుమత్రా దీవులలో ఘర్షణలు జరిగాయి జావాలో యీ విప్లవం ఆరువారాలు జరిగింది. ఆఖరున డచ్చిప్రభుత్వం అతి రాక్షసకృత్యాలకు దిగింది. ప్రజానాయకులను నిర్బంధించింది ఎందరినో న్యూగినీలోని పైశాచికపు క్యాంపులకు పంపివేసింది. కొందరి తల తీయించివేసింది

తిరిగి కమ్యూనిస్టు నాయకత్వంక్రింద ఇండొనేషియా ప్రజలు 1927 మొదటిలో డచ్చి ప్రభుత్వంపై తిరుగుబాటు చేశారు. యుద్ధానికి పూర్వం నడిచిన ఇండొనీషియా స్వతంత్ర సంగ్రామంలో ఈ సంఘటన మహత్తరమైనది. ఎన్నోచోట్ల ప్రజలకు ప్రభుత్వ సైనికులకు సంఘర్షణలు జరిగాయి. సిలూంగ్ కంగ్ అనేచోట 7 గురు దేశభక్తులు హతులయ్యారు ఇద్దరు పోలీసులు గాయపడ్డారు డచ్చి ప్రభుత్వం 4500 మంది ఇండొనీషియన్లను - ఇందులో కమ్యూనిస్టులు, సమ్మెలోపాల్గొన్న కార్మికులు, జాతీయవాదులున్నారు. జైళ్ళలో త్రోసింది; 1,308 మందిని తనమరా, తనటింగి చావు కాంపులకు ప్రవాసం పంపింది.

అప్పటినుండి మొన్న రిపబ్లిక్ స్థాపింపబడేవరకు కమ్యూనిస్టుపార్టీ రహస్యంగా ప్రజల్లో పనిచేయవలసి వచ్చింది.

యూరపులో నాజీ నరహంతకులు స్వతంత్ర ప్రియులను నానాబాధలకు గురిచేసిన బెల్సెన్, డాచూ, బుచెల్వాల్డు కాంపులలాంటివే ఈ తనమరా తనటింగు క్యాంపులు. 1927 సంవత్సరం ఇండొనేషియా స్వతంత్ర

చరిత్రలో ఉజ్వలఘట్టం అప్పటినుండి నేటిదాక, ఆక్యా-పులకు ప్రవాసము పంపబడిన వీరులను ఇండొనేషియాలోని ప్రతి వ్యక్తీ అతిభక్తితో ప్రతిరోజు స్మరించి ఆ వీరులకు జోహారులర్పిస్తుంటాడు.

ఆ ప్రజావుద్యమాల్ని పశుబలంతో, ఆయుధ సంపత్తితో అణచి తర్వాత, డచ్చి సామ్రాజ్యవాదులు అతి రాక్షసచర్యలకు దిగారు ప్రజలపై హింసాతాండవం చేశారు. రాజకీయ సంస్థల ప్రతి దినకార్యక్రమం నడవడం కష్టతరంగా పరిణమించింది. 'సారేకత్-ఇ-మేర' 'సారైయి కమ్యూనిస్టి ఇండొనేసీ' (కమ్యూనిస్టుపార్టీ) లాంటి పాతపార్టీలు రహస్యంగా పనిచేయవలసివచ్చింది. హాలండులో చదువుకొనివచ్చిన ఇండొనేషియా విద్యావంతులపార్టీ (పారైయి హిషనలే' (నేషనలిస్టుపార్టీ)ని ప్రభుత్వం కొన్నాళ్లు పనిచేయనిచ్చింది. ఈపార్టీకి డాక్టర్ సోకర్నో. హట్టాలు నాయకులు. అప్పుడు బయలుదేరినదే. "ఇండొనేసీరాయా అనే జాతీయగీతం. నేటికీ ఇదే జాతీయగీతం

తర్వాత 1929 లో ఈ 'హరై నేషనల్‌ని కూడ ప్రభుత్వం నిషేధించింది. పార్టీ నాయకులైన సోకర్నో, హట్టాల నిద్దరికి ప్రవాస శిక్ష విధించింది. ఈ నిషేధం తర్వాత ఏవిధమైన బహిరంగ ఉద్యమం గాని అసాధ్యమయిపోయింది. స్వతంత్రం కోసం పనిచేసే అన్ని సంస్థలను కూడ చట్టవిరుద్ధ సంస్థలగా ప్రకటించసాగారు. అలాంటి సంస్థలలో పనిచేసే వారికి కఠోరశిక్షలు విధించారు (ఈ చట్టాలను గూర్చి మొదటి అధ్యాయంలోనే వివరాలిచ్చాను )

1929 తర్వాత ప్రజాపోరాటం గుసగుసల ద్వారా నడిచింది. ఏ యురేషియనో, డచ్చి పోలీసువాడో వింటే తనమరా కాంపే శరణ్యాం. అయినప్పటికీ రహస్యోద్యమం బహిరంగంగా పనిచేస్తున్న రోజుల్లో కన్నా కూడా బాగా బలపడింది. ప్రజల్లో పాతుకొంది, ఇండొనీషియా ప్రజల్లో సగం వంతు మంది 'రహస్యసంస్థ' చిహ్నమైన అయిదంచుల గుర్తును షర్టులలో ధరించేవారు.

1942 మార్చిలో జపాను రావడంతో ఇండొనేషియా ప్రజల బాధలు అంతంకాలేదు 'ఆశియా ఆశియా వాసులకే' అన్న జపాన్ నినాదంతో కొంతకాలం భ్రమపడిన ఇండొనేషియన్లు త్వరలో యదార్థ స్థితిని గ్రహించారు వెంటనే రహస్య కమిటీలలో తీవ్రంగా పనిచేయ

సాగారు. మిత్రరాజ్యాలెప్పుడు జపాన్ బలాన్ని అణచుతాయా! ఎప్పుడు అవకాశం తీసుకుందామాని వీరు సమయంకోసం కాచుకున్నారు.

జపాన్ దురాక్రమణ కాలంలో వివిధ వర్గాల ఇండొనేషియా ప్రజల్లో సమైక్యత చేకూరింది. అదును చూచి దెబ్బ తీయాలని ఆ సంఘటిత ప్రజానీకం కాచుకొన్నది. కడకా సమయం వచ్చింది. జపాన్ జితోస్మి అన్నది. డచ్చి ఉద్యోగులు యుద్ధఖైదీలుగా ఉన్నారు. టోకియోలో 1945 ఆగస్టు 15 తేదీన జపాన్ మెకార్థర్‌కు లొంగిపోయింది. వెంటనే ఇండొనేషియన్లు ఆగస్టు 17 తేదీన తమ స్వతంత్రం ప్రకటించారు. జపాను సైనికులను నిర్బంధించి నిరాయుధులను చేయసాగారు. జకార్తాలో రిపబ్లిక్ కార్యాలయం ఏర్పడింది.

తొట్టతొలుత రిపబ్లికన్ ప్రభుత్వం రాజకీయ ఖైదీలందరిని విడుదల చేసింది. బాండుంగు జైల్లో ఉన్న చాలమంది కమ్యూనిస్టులను విడిచిపెట్టింది.

ఆగస్టు 19 తేదీన ఇండొనేషియా ప్రజలపక్షంగా డాక్టర్ సోకర్నో హట్టాల సంతకాలతో ఈ క్రింది ప్రకటనను ప్రజలందరు మహోత్సాహంతో చదివారు.

"ఇండొనేషియా ప్రజలమంతా మా స్వతంత్రాన్ని ప్రకటిస్తున్నాము.

"స్వతంత్రం ప్రతి దేశానికి హక్కు. మానవత్వానికి విరుద్ధమైన ఏ విధమైన దాస్యంకూడ ప్రపంచంలో లేకుండా నిర్మూలించాలి.

"మా పోరాటం మహదాశయాన్ని సాధించింది. ఇండొనేషియా ప్రజలను స్వతంత్ర ఇండొనేషియా ప్రభుత్వం ద్వారంలో ప్రవేశపెట్టింది. ఈ ప్రభుత్వం, స్వతంత్ర, సమైక్యత, న్యాయ, సౌభాగ్యత సంపన్నమైనది.

"భగవదాశీర్వాదంతో, స్వతంత్ర జాతీయజీవనపు ఉత్కృష్టాశయాలతో ఇండొనేషియా ప్రజలు తమ స్వతంత్రాన్ని శాశ్వతంగా నిలుపుకొనేందుకు నిశ్చయించారు.

"ఇండొనేషియా రిపబ్లిక్కులో సర్వాధికారాలు ప్రజలవే.

"రిపబ్లిక్ ఆశయాలివి ; పవిత్ర మానవనైతిక సమాజం, ఇండొనేషియా, ఐక్యత ప్రజాస్వామ్య పాలన."

ఇండొనేషియా ప్రజానీకం ఏకకంఠంతో స్వతంత్రంగా ఉండా లని, తామెన్నటికి తిరిగి డచ్చిదాస్యానికి లొంగిపోరాదని ప్రతిజ్ఞ తీసుకున్నారు. కాని డచ్చివారికి సాయంవచ్చింది. జపాన్ సైనికులను నిరాయుధులను చేయాలన్న సాకుతో బ్రిటిష్‌సేనలు మెల్లగా ఇండొనేషి యాలో ప్రవేశించాయి.

హాలండు పక్షంగా బ్రిటిష్ సామ్రాజ్యవాదులు జోక్యం తీసుకో వడం ఇండొనేషియాకు దెబ్బ. ఒక్క హాలండు మాత్రమేఐతే నూతన ప్రజాప్రభుత్వాన్ని ఎదుర్కొ-లేని దుర్బలస్థితిలో ఉన్నది.

ఈ ఘాతుక కృత్యానికి పాల్పడవద్దని సొకర్నో, హట్టాలు బ్రిటన్‌కు విజ్ఞప్తి చేశారు. మిత్రరాజ్యాలకు విన్నవించారు 1945 అక్టో బర్ 23 తేదీన మిత్రరాజ్య దూరప్రాచ్య సలహాసంఘం వాషింగ్టన్‌లో సమావేశ మవుతుందని విన్నారు. ఇండొనేషియన్లు తమ విజ్ఞప్తిని మిత్రరాజ్య సమితిముందుంచాలనుకున్నారు. కాబట్టి డా. సొకర్నో. హట్టాలు ఈ క్రింది విజ్ఞప్తిని సోవియట్‌రష్యా. అమెరికా, బ్రిటన్, ఫిలి ప్పైన్సు న్యూజిలాండు, ఆస్ట్రేలియా. హాలండు, చైనా, కనడా. ఫ్రాన్సు, ఇండియాలకు పంపారు :

"భూగోళరీత్యా ఇండొనీషియా దూరప్రాచ్యంలో చేరినది కాబట్టి మిత్రరాజ్యాల దూరప్రాచ్య సలహాసంఘంలో తమకు ప్రాతినిధ్యంఉండా లని ఇండొనేషియా ప్రజలు వాంఛిస్తున్నారు. ఈక్రింది కారణాలవల్ల ఇండొనేషియాకు ప్రాతినిధ్యం ఇవ్వాలి

1. ఇండొనేషియా 1945 ఆగస్టు 17 వ తేదీన స్వతంత్రాన్ని ప్రకటించింది.

2. ఏడుకోట్ల ఇండొనేషియా ప్రజలు, శాశ్వతంగా డచ్చివలస దేశపాలననుండి తెగతెంపులు చేసుకోవాలని కృత నిశ్చయులై ఉన్నారు

3 ఇండొనేషియా రిపబ్లిక్కు ప్రజాస్వామ్య సూత్రాలకు అను గుణ్యమైన స్థిరప్రభుత్వం ఏర్పరిచింది

4. ఇండొనేషియా రాజ్యాంగచట్టం ప్రజలకే సర్వహక్కులను అప్పగించింది కాబట్టి మేము ఏవిధమైన నిరంకుశ, ఫాసిస్టు పరిపాల నాపద్ధతికిగాని వ్యతిరేకులమన్నది విస్పష్ట పడుతున్నది.

5. తమ రిపబ్లిక్ తప్ప, మరో ప్రభుత్వాన్ని ఇండొనేషియన్ ప్రజలు తమదేశంలో గుర్తించరు.

6. ప్రపంచ సౌభాగ్యానికి కాకున్నా, దూరప్రాచ్య సౌభాగ్య సంపదలకు అవసరమైన ముడిసరుకులు ఇండొనేషియాలో ఉన్నవి.

"నేడు ఇండొనేషియాలో ఏర్పడిన రాజకీయ పరిస్థితి ఏడుకోట్ల ఇండొనేషియా ప్రజల వాంఛలను సంతృప్తిపరచడంలేదు. ఇప్పుడిక్కడ నాలుగు రకాల పాలనా పద్ధతులున్నవి. అందువల్ల శిక్షణాయుతమైన ప్రవర్తనం సాధ్యంకావడంలేదు.

"ఇండొనేషియా రిపబ్లిక్ ప్రభుత్వం, మిత్రరాజ్య సైనికపాలన సంస్థ, నెదర్లాండ్సు (డచ్చి) ఈస్టిఇండీస్ పాలకసంస్థ, పైగా జపాను సైనిక వ్యవస్థ, ఇన్ని ఈ దేశంలో ఇప్పుడున్నందువల్ల ప్రజల్లో గందరగోళం ఏర్పడింది. మిత్రరాజ్య సైనికసంస్థ జపానువారిని నిరాయుధులను చేస్తూనే వెళ్ళిపోతున్నట్లు తెలుస్తున్నది. కాబట్టి ఆతర్వాత డచ్చి ప్రభుత్వం, ఇండొనేషియా రిపబ్లిక్ ప్రభుత్వం ఉంటాయి.

"ఇండొనేషియా రిపబ్లిక్కును ప్రజలు బలపరుస్తున్నారా లేదా అనే అనుమానానికే ఆస్కారంలేదు. ఈ తొలిరోజుల్లోనే, ప్రజలు డచ్చి పాలన ఏర్పరచే ప్రయత్నాలన్నిటినీ నిరోధించాలని నిశ్చయించుకొన్నారు. ఈసంకల్పం కార్యరూపంతాల్చిందికూడా. అయినప్పటికీ 1942 నాడు తమనుండిపోయిన ఇండొనేషియాలో ఎలాగో తావుకల్పించుకోవాలని డచ్చివారు అన్ని విధాలైన హింసాకార్యాలకు దిగారు. అక్టోబరు 1 వ తేదీన డచ్చి హింసా కార్యక్రమం ఆరంభమైంది. అంతటినుండి నేటి వరకు (అక్టోబరు 11, 1945) డచ్చి ఘాతుక కృత్యాలకు పందలకొలది ఇండొనేషియన్లు బలి అయ్యారు.

"ఇండొనేషియా స్వతంత్రపోరాటాన్ని నిర్మూలించేదుకు, డచ్చివారనుసరిస్తున్న అక్రమ అమానుషచర్యలు చూచి ఇండొనేషియా ప్రజలు చాల ఉద్రిక్తులై ఉన్నారు. విదేశీయుల పీడనను శాశ్వతంగా తొలగించుకొని స్వతంత్రులు కావాలని నిశ్చయించుకున్నారు. మాకు మిత్రరాజ్యాలపై విశ్వాసముంది. మిత్రరాజ్యాలు ఈ యుద్ధంలో స్వతంత్ర, మానవత్వం, న్యాయపక్షాలవైపు నిలిచి పోరాడాయి. కాని, మా జాతీయ

స్వతంత్రవాంఛను వినక మిత్రరాజ్యాలు డచ్చి వలస పాలననే, పునః ప్రతిష్ఠ చేయాలనుకుంటే ఇండొనేషియన్లు నిరాశాహతులవుతారు.

"కాబట్టి ప్రపంచ ప్రజలకు, ముఖ్యంగా అమెరికా ప్రజలకు ఇండొనేషియన్ ప్రజల విజ్ఞాపించేదమంటే : మేము మిత్రరాజ్యసమితిలో సభ్యత్వానికై పెట్టిన దరఖాస్తును బలపరచండి. మిత్రరాజ్యాల దూర ప్రాచ్య సలహాసంఘం అక్టోబరు 23 '45 న తొలిసారి సమావేశమవుతుందనుకుంటున్నాము.

"ఇండొనేషియాలో డచ్చిపాలనను సాగనివ్వడమంటే, ప్రజాస్వామ్యానికి, ప్రపంచ శాంతికి ప్రపంచంలో ఈ మిత్రరాజ్యాలు రక్షణనివ్వలేక పోయాయన్నమాట. ఇండొనేషియాను సలహాసమితిలో పాల్గొననిస్తే, యుద్ధం ఎందుకోసం చేశారో ఆ మిత్రరాజ్య ఆశయాలు నెరవేరుతాయన్నమాట."

బ్రిటిష్ ప్రభుత్వం, ఇండొనేషియన్ ప్రభుత్వం జపాను కీలుబొమ్మ అని, తాము వారికి వ్యతిరేకంగా, జపాను సైనికులను నిరాయుధులను చేసేందుకు ప్రయత్నిస్తున్నామని ధర్మపన్నాలు చెప్పారు. కాని విలేఖరులెందరో, జపాను సైనికులను బ్రిటిష్, డచ్చి అధికారులే ఉపయోగిస్తున్నారని విస్పష్టంగా వ్రాశారు బ్రిటిష్‌కు తెలియకకాదు. బుద్ధిపూర్వకంగా తమ రాక్షసవిధానాన్ని కప్పుకునేందుకు పైనిందలు వేయసాగింది

ఇదంతా పూర్వము స్థిరపరుచుకున్న విధానమే. బ్రిటన్, డచ్చి దురాక్రమణకు వెనకనున్న నూనె కంపెనీల గుత్తవ్యాపారస్థులు తమ క్రిందికి ఇండొనేషియాను లాక్కోవాలని కలలుగంటూ వచ్చారు.

బ్రిటిష్ షెల్ ట్రాన్స్‌పోర్టు అండ్ ట్రేడ్ కంపెనీ చైర్మన్ వైకౌంట్ బీర్‌స్టెడ్ షేర్‌హోల్డర్ల వార్షికసమావేశంలో జులై 10 (1945) నాడే ఇండొనీషియా నూనెగనులనుగూర్చి ఇలాచెప్పాడు :

"ఈ గనులెంకా జపాన్ చేతిలో ఉన్నవి. తరకాన్‌లో మెటుకు మన సేనలు దిగాయి. అక్కడ మన ఆస్తులు కొన్ని తిరిగి దొరికాయి. అక్కడ మన పునర్నిర్మాణకార్యక్రమాని కప్పుడే ప్రణాళికలు తయారు చేశాము. తగిన యంత్ర సామగ్రి దొరుకుతూనే పని ప్రారంభిస్తాము"

బ్రిటన్ ఇండొనేషియాలో జోక్యం కల్గించుకునేందుకు ముందుగానే ప్లాను వేసిందని పై వాక్యాలు సూచిస్తాయి.

ఇండొనేషియన్లు విదేశ పాలనకు తలవొగ్గే స్థితిలోలేరని పసికడుతూనే యుద్ధకాంపులనుండి విడిపించిన 10 వేల డచ్చి సైనికులకు అరణ్య యుద్ధ పద్ధతులలో మంచి తర్ఫీదునిచ్చింది. వీరిని తిరిగి ఇళ్ళకు పంపుతున్నామంటూ ఇండొనీషియాకు దిగుమతి చేసింది.

బ్రిటన్ ఎన్ని అబద్ధాలు ప్రచారంచేసినా, ఇండొనేషియా ప్రజలది స్వతంత్ర పోరాటం. సెప్టెంబరు 29 న జావాలో బ్రిటిష్ సేనలు దిగిన రోజు. ఇండొనీషియా స్వతంత్ర పోరాటాన్ని అణచేందుకు సామ్రాజ్యవాదులు యుద్ధం ప్రారంభించారు. ఈ సామ్రాజ్యవాదుల పాలనను సాంతంగా తుదముట్టించడానికి ఇండొనేషియా ప్రజలు లేచారు. ఇండొనేషియా చరిత్రలో ఒక నూతనాధ్యాయం ప్రారంభమయింది.

# 5. ప్రజా సన్నాహ సంరంభం

బ్రిటన్ అనుకున్నంత సులభంగా ఇండొనేషియాను దోచుకొనుటకు అవకాశం చిక్కలేదు.

ఇండొనేషియా ప్రజానీకం ఒక్కమనిషిలా సన్నద్ధమై స్వతంత్ర రక్షణకు పూనుకుంది. 45 అక్టోబరులో జాతీయమహాసభ బటేవియాలో జరిగింది. ఈ ప్రజాపరిషత్తు ఒక కేంద్ర జాతీయసమితిని ఏర్పరిచింది. ఈ కమిటీకి బాధ్యత వహిస్తూన్న కార్యవర్గసంఘం ఏర్పరచి రోజువారి పాలనను ఆ కమిటీకి అప్పగించారు.

ఇండొనేషియా స్వతంత్రంగా, ప్రజాస్వామికంగా ఉండాలన్న ప్రజా వాంఛను ఈ జాతీయమహాసభ ప్రతిబింబించింది. ఇండొనేషియా రిపబ్లికక్కును అంగీకరించమని విదేశ ప్రభుత్వాలకు ఈ సమితి విన్నవించింది. శాంతి మహాసభలో తమకు స్థానం కావాలని వాంఛించింది.

అందుతోపాటు జపానువారిని నిరాయుధులను చేసే పనిలో మిత్ర రాజ్యసేనలతో తాము సహకారం చేస్తామని ఈ సభలో నాయకులు

తీర్మానించారు. ఆ పని ముగుస్తూనే విదేశసేనలన్నీ ఇండొనేషియా వదలి వెళ్ళాలని సోకర్నో విస్పష్టపరిచాడు.

ఈ మహాసభ ఆజ్ఞానుసారం రిపబ్లిక్ ప్రభుత్వం బ్రిటిష్ సేనాని జనరల్ క్రిస్టసన్‌కు ఈ క్రింది ప్రతిపాదనలు అందజేసింది-

1. ప్రస్తుతం ఇండొనేషియాలో ఉన్న డచ్చిసేనలు వెళ్ళిపోవాలి. ఇంకే డచ్చిసైనికులు దిగరాదు.

2 డచ్చి పౌర పరిపాలన వెంటనే రద్దవాలి.

3. ఇండొనేషియా సమస్యను మిత్రరాజ్య సమితిగాని, అగ్ర రాజ్య పంచకంగాని చర్చించి పరిష్కరించేవరకు ఇప్పుడున్న రిపబ్లిక్ ప్రభుత్వాన్ని వస్తుతః ప్రభుత్వంగా గుర్తించాలి

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు, వ్యవహారం ఎదురు తిరుగుతున్నదని గ్రహించి కొత్త ఎత్తులకు దిగారు. డచ్చిపాలనను రద్దుచేసి వెంటనే డచ్చి ఉద్యోగులందరిని కలుపుకొని బ్రిటిష్ పాలనను ఏర్పరిచారు.

తమ అధికారం జారిపోతున్నదన్న అక్కసుతో డచ్చి ప్రభుత్వాధికారులు అమానుష చర్యలకు దిగజారారు. టైమ్సు ఆఫ్ ఇండియా వంటి అభివృద్ధినిరోధకవర్గ పత్రిక విలేఖరికూడ డచ్చివారి ఖైదీల క్యాంపుల్లో జరుగుతున్న పశుకృత్యాలను వ్రాశాడు. అయిదుగదుల్లో ఒక్కొకగది 11 x 18 అడుగులు కలది — 218 మంది ఇండొనేషియన్లను నిర్బంధించారని ఆ విలేఖరి వ్రాశాడు.

ఎలాగో తమ చమురుగనుల వ్యాపారం నిలుపుకోవాలన్న ఆదుర్దాతో బ్రిటన్ డచ్చి ప్రభుత్వంపై ఒత్తిడితెచ్చి రాజీ కమ్మంది.

డచ్చి సామ్రాజ్యవాదుల పక్షంగా వాన్‌మూక్‌ను డాక్టరుషారీరును జనరల్ క్రిస్టసన్ కార్యాలయంలో సమావేశపరిచారు. ఈరాయబారాలు నవంబరు తొలివారంలో ప్రారంభమయ్యాయి.

కాని త్వరలోనే ఈసంప్రతింపులు విఫలమయ్యాయి. డచ్చిప్రభుత్వము ఈసంప్రదింపులను ఖండిస్తూ ప్రకటించింది. అదే సమయంలోనే బ్రిటిషు కమాండరు సురబయాలో యుద్ధంలో చనిపోయాడు. ఇందుతో బ్రిటను పగసాధించేందుకు, ఇండొనేషియా ప్రజలపై యుద్ధం నిజంగా ఆరంభించింది.

ఇ ఈ సమయంలో డచ్చిప్రభుత్వం తమ సామ్రాజ్యాన్ని కామన్వె ల్తుగా ఏర్పరుస్తామని అందులో భాగస్వామిగా ఇండొనేషియా ఉండ వచ్చునని ప్రకటన చేసింది. కాని స్వతంత్రకాముకులయిన ఇండొనే షియా నాయకులు ఈ ప్రతిపాదనను నిరాకరించారు.

తమ ముందున్న మార్గం కంటకపూరితమని, యుద్ధం చాలనాళ్లు సాగించవలసి రావచ్చునని ఇండొనేషియా నాయకులు బలవత్తరమూ, ప్రజాప్రాతినిధ్యపూరితమూ అయిన రీతిగా తమ ప్రభుత్వాన్ని పునర్ని ర్మించారు.

నవంబరు 13 వ తేదీన డాక్టర్ సోకర్నో నూతన ప్రభుత్వాన్ని ప్రకటించాడు. ఈ ప్రభుత్వానికి ప్రధాని డాక్టర్ సుల్తాన్ షరీర్. ఇందులో జపాన్ ప్రభుత్వంతో ఏ మాత్రం సహకరించని ప్రధాన జాతీయనాయ కులే మంత్రులయ్యారు. "దేశపాలనను ప్రజాస్వామికంగా మార్చే ప్రయత్నాలకు సమయం ఆసన్నమైంది" అని షారీర్ ప్రకటించాడు.

డాక్టర్ షారీర్ నవంబరు (1945) ఆఖరున జాతీయ విప్లవకార్య క్రమాన్నిగూర్చి ఇలా ఒక కరపత్రం ప్రకటించాడు

"నేడు విప్లవం నడుపుతున్నవారు కార్మికులు, యువకులు స్వతంత్రమంటే విదేశపాలన నిర్మూలనం మాత్రమే. కాని కార్మికులకు స్వతంత్రమంటే, విదేశపాలన నిర్మూలనంతోపాటు తమ కష్టాలుకూడ నిర్మూలనం కావాలి. స్వతంత్ర పోరాటంలో ఈ దృక్పథాన్ని ఇండొ నీషియన్లు మరచిపోరాదు. కేవలం విదేశపాలనతో సంతృప్తిపడి. ప్రజా స్వామ్య వైఖరిని వదిలితే, మన స్వతంత్రపోరాటం కేవలం ఫాసిజం లోకి దిగజారి పోతుంది.

నవంబరు 25 న ఇండొనేషియా నాయకుల జాతీయ సమావేశం బటేవియాలో జరిగింది. 100 మంది సభలో పాల్గొన్నారు. ఇందులో వివిధ రాజకీయపార్టీలకు, కార్మిసంఘాలకు, యువకులకు రైతులకు ప్రాతినిధ్యం ఏర్పడింది.

తమ మిత్రులని డచ్చివారనుకుంటున్న అంబోనీయులుకూడ ఇందులో పాల్గొన్నారు. 10 మంది మహిళా ప్రతినిధులు, 4 చైనీయుల పతినిధులు. 3 యూరేపియన్లుకూడ సభకు వచ్చారు.

ఆ సభలో ప్రజాస్వామ్యదృక్పథానికి విజయం చేకూరింది. అన్ని

పార్టీలకు చెందిన 25 మంది ప్రతినిధులతో కార్యవర్గం ఏర్పడింది. ఈ మహాసభ షారీర్ మంత్రివర్గాన్ని పూర్తిగా బలపరచింది.

ఈ సభ తర్వాత దేశంలో రాజకీయ కార్యక్రమం తీవ్రతరమయింది ఈ క్రింది ప్రధాన రాజకీయ పక్షాలు ఏర్పడ్డాయి.

1. ఇండొనేషియా సోషలిస్టుపార్టీ.

2. ఇండొనేషియా క్రైస్తవ సంఘం.

3. ఇండొనేషియా కమ్యూనిస్టుపార్టీ. 1926నుండి రహస్యంగా పనిచేస్తున్న ఈపార్టీ తిరిగి బహిరంగంగా పునర్నిమితమైంది.

4. ఇస్లాంపార్టీ. ఇది మధ్యతరగతి మేధావులపార్టీ.

ఇందుతోపాటు కార్మికసంఘాలు, పైరగాయి ఇకతన్, సారేకలీ సెకర్జా - ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ ఏర్పడింది. బాలిసన్‌తాని ఇండొనేషియా - రైతుసంఘం, విద్యార్థిసంఘం ఏర్పడ్డాయి. ఈ వుద్యమాలన్నీ షారీర్ ప్రభుత్వాన్ని బలపరచాయి.

ఇలా ఇండొనేషియా ప్రజలందరు సంఘటితులై ఆంగ్లో - డచ్చి దురాక్రమణను విచ్ఛిన్నంచేసి స్వతంత్రులు కావాలని కృతనిశ్చయులయ్యారు.

ఇందుతోపాటు డచ్చి బ్రిటిష్ సైనికాధికారులు సింగపూరులో డిసెంబరులో సమావేశమై ఇండొనేషియా స్వతంత్ర పోరాటాన్ని విధ్వంసం చేయాలని నిశ్చయించుకున్నారు. తమ నీచ కార్యాలకు నాందీ చేశారు.

## 6. బ్రిటిష్ ప్రభుత్వ దారుణ చర్యలు

కేవలం జపాను సైనికులను నిరాయుధులను చేసేందుకే వచ్చామని సాకులుచెబుతూ బ్రిటిష్ సామ్రాజ్యవాద సేనలు అతిదారుణంగా ఇండొనేషియాపై యుద్ధం సాగించాయి. నిరాయుధులైన అమాయక ప్రజా సమూహాన్ని నానాబాధలు పెట్టారు ఫాసిస్టు సేనలు దురాక్రమణలో చేసిన దురంతాలను మించిన ఘాతుక కృత్యాలకు లోనయ్యారు.

గ్రామాలకు గ్రామాలను విధ్వంసం చేశారు. పట్టణాలను అతి రాక్ష

సంగా బాంబులతో నిర్మూలించారు. ఒక్క బెక్కాసీస్లో బ్రిటిష్ సేనలు జరిపిన ఘోరకృత్యాలగూర్చి డాక్టర్ హట్టా హిందూ విలేఖరి కిలా తెలిపాడు ; (డిసెం. 22)

"పైరులతో కన్నుల పండువుగా కళ కళ లాడే మా గ్రామ సీమలను, శాంతిభద్రతా రక్షణ మిషతో బ్రిటిష్ సేనలు స్మశానవాటికలుగా మార్చివేస్తున్నాయి

"బెక్కాసీస్ గ్రామాన్ని బ్రిటిష్ అధికార్ల నాయకత్వాన పంజాబు సైనికులు చుట్టు ముట్టారు. ఒక్క యిల్లు కూడా విడువకుండా అన్ని పేటల్లోని యిండ్లపైన పెట్రోలుపోసి నిప్పంటించారు. చెల్లాచెదరై పారిపోతున్న ప్రజానీకాన్ని పిల్ల పెద్ద అనే విచక్షణ లేకుండా పిట్టలను కొట్టినట్లు రాయల్ వైమానికులు బాంబులతో వేటాడారు.

"నిరాయుధులై, నిస్సహాయులై, అలమటించే అశేష పరాధీన జాతులను అణచేందుకు సామ్రాజ్యవాదులు అమలు జరిపే ఫాసిస్టు రాక్షస దురంతాలకు బెక్కాసీస్ సంఘటన నాందీ మాత్రమే.

"ఒక జాతి స్వాతంత్ర్య కాంక్షను శాశ్వతంగా బాంబులతో బందూకాలతో నిర్మూలనం చేయజూడడం వెఱ్ఱి తలంపు."

ఒక బెక్కాసీస్ ఏమిటి బ్రిటిష్ సేనలు, అందుకు తోడు భారత సేనలను కూడ ఉపయోగించి ఇండొనేషియాలో జరిపిన దురంతాలు అనంతాలు. హిందూ విలేఖరి టి. నారాయణన్ వీనిని గూర్చి వివరించి ఇలారాశాడు. "జావాలో నేడు మిత్రరాజ్య మిలటరీ అధికారవర్గంచేసే చర్యల నిజస్వరూపం బయటపెడితే సభ్యప్రపంచ హృదయం నిలువునా కంపించిపోయి, అసహ్యించుకొంటుంది"

ఇలాంటి ఫాసిస్టు కృత్యాలతో బ్రిటిషు సామ్రాజ్యవాద సేనలు, బటేవియాను, టాంగరాన్ను, ఖాండాంగును ఆక్రమించాయి ఖాండాంగులో మూడువంతులు దగ్ధంచేసివేశారు. తర్వాత ఆక్రమించారు. తర్వాత డచ్చి సేనలు బలిద్వీపంలోదిగాయి. ఇండొనేషియా ప్రజలు అతిసాహసంతో ఎదిరించారు. విపరీతమైన బాంబులవర్షంతో బ్రిటను, డచ్చిసేనల స్థావరం ఏర్పరచుకోగలిగాయి.

సురబాయాలో 33 రోజులు ఘోరయుద్ధం జరిగింది. ఇంటింటి వద్ద ప్రజలు దురాక్రమణ సేనలను ఎదుర్కొన్నారు.

ఈఘోర దురంతాలనుగూర్చి మిత్రరాజ్య భద్రతా సమితిలో యుక్రైను ప్రతినిధి విచారణసంఘాన్ని ఇండొనేషియాకు పంపాలని ఒక తీర్మానం తెచ్చాడు. ఈఅన్యాయాలు జరగగూడదన్నాడు. సోవియటు ప్రతినిధి ఆతీర్మానాన్ని బలపరిచాడు యుక్రైన్ ప్రతినిధి ఇలా అన్నాడు "జావాలో బ్రిటిషు సేనలు ఇండొనీషియా ప్రజలపై విమానాలను, టాంకులను ఉపయోగించుతూ, కొన్ని నెలలుగా పోరాటం సాగిస్తున్నాయి. పైగా జపానుసేనలనుకూడ ఆ దేశప్రజలపై ఉపయోగిస్తున్నారు.

"డచ్చి ప్రదేశంనుండి జపానువాళ్ళను తరమడం వరకే బ్రిటిష్ సేనల కర్తవ్యం. దీనిఅర్థం ఇండొనేషియా ప్రజల న్యాయవాంఛలనుఅణచాలని బ్రిటన్ ఆయుధాలను ఉపయోగించాలని కాదు."

సోవియట్ ప్రతినిధి విషింస్కీ ఇలా అన్నాడు.

"ఇండొనేషియా ప్రజలపైన, జాతీయోద్యమంపైన సాగించే ఇలాంటి చర్యలు, ఏ కొద్దిమంది దౌర్జన్యవాదులపైనో కాదని, శాంతి రక్షణకు కాదని నేను భావిస్తున్నాను. 'శాంతిభద్రతల రక్షణ' అనే పదానికి వలసదేశ చరిత్రలో ఘోరమైన అపార్థం ఉంది. స్వతంత్రం కోరే ప్రజలపై, తమ స్వతంత్రం రక్షించుకునే ప్రజలపై, క్రూరనిర్బంధ విధానం అవలంబించడమే 'శాంతి రక్షణ' అనే మాటకు అర్థంగా పరిణమించి పోయింది.

"ఇండొనేషియాపై యుద్ధం జరుగుతున్నది. ఇది చాల ప్రమాదకరమైన స్థితి. భావికిది తీవ్రహానికరం."

ఇలా సోవియట్, యుక్రైన్ ప్రతినిధులు బ్రిటిష్ కుట్రలను ప్రపంచానికి వెల్లడించారు. తీవ్రంగా ఖండించారు. బెవిన్ బ్రిటిష్ విదేశాంగమంత్రి ఏమో కుంటిసాకులు చెప్పాడు. తాము కేవలం జపాను సైనికులను నిరాయుధులను చేయడానికే ఉన్నామని ? ఆత్మరక్షణకు కొంత ఆయుధప్రయోగం చేయవలసివచ్చిందని కల్లిబొల్లి మాటలు చెప్పాడు. ఏ బుద్ధిమంతుడూ ఈ మాటలు నమ్మలేదు.

ఆఖరుకు సామ్రాజ్యవాదులందరు ఆ తీర్మానాన్ని వ్యతిరేకించడంతో భద్రతాసమితిలో వీగిపోయింది. కాని అందుకు మరో ముఖ్య కారణంకూడ లేకపోలేదు. ఈ చర్చ జరిగే సమయానికి సరిగా ఏవో

సంధిరాయబారాలంటూ ఆంగ్లో - డచ్చి సామ్రాజ్యవాదులు ఆరంభించారు కొన్ని సూచనలతో ఇండొనేషియాకు రాయబారం పంపారు; ఆ ప్రతి పాదనల్లో ఏమిలేకున్నా తమకు దాన్నొక ఆయుధంగా ఈ చర్చలో సామ్రాజ్యవాదులు ఉపయోగించుకోగలిగారు

# 7. సంప్రతింపుల నాటకం

ఇండొనీషియాలో ఎలాగైనా తమ ప్రాపకం ఉంచుకొనాలని, అక్కడి ముడిసరుకులను కాజేయాలని బ్రిటన్ కుట్రలు పన్నుతూనే ఉంది డచ్చి ఎలాగూ స్వయంగా ఇండొనేషియాను నిలుపుకోలేదని తెలిసిపోయింది బ్రిటన్ డచ్చి పేరు చెప్పి తన పలుకుబడిని ప్రాచ్య మంతా నిల్పుకోవాలని నిశ్చయించుకుంది అందుకు కొత్తఎత్తులు వెతక నారంభించింది. ఒకవేపు ఇండొనేషియా స్వతంత్రపోరాటాన్ని బల ప్రయోగముతో అణచివేసి, మరోవేపు వారిని డచ్చితో ఏదో విధంగా రాజీ పడేట్టుచేయాలని తద్వారా యథాప్రకారంగా పీడన ఆధునిక పద్ధతుల లతో సాగించవచ్చునని బ్రిటన్ పూనుకుంది.

ఒకవేపు ప్రపంచ ప్రజాస్వామ్య వాదులందరు ఇండొనేషియా స్వతంత్రవాదులపై సానుభూతి చూపసాగారు. ఆంగ్లో - డచ్చికుట్రలను బయటపెట్టసాగారు. ఇవన్నిటి మూలంగా సంప్రతింపుల నాటకాన్ని సామ్రాజ్యవాదులుప్రారంభించారు.

డచ్చిమంత్రులూ బ్రిటిష్ ప్రభుత్వమూ సమాలోచించి కొన్ని ప్రతి పాదనలను తయారుచేశారు వాగా కపటనీతిలో చేయి తిరిగిన సర్ క్లార్కుకర్‌ను ప్రత్యేక బ్రిటిష్ రాయబారిగా, డచ్చి ప్రతినిధి వాన్ మూక్‌తోపాటు పంపారు.

ఈ లండన్ ప్రదిపాదనలను భద్రతాసమితిలో ఇండొనేషియా సమస్య చర్చకువచ్చిన సమయంలోనే తయారుచేశారు 1946 ఫిబ్రవరి 10 వ తేదీన ఇండొనేషియా ప్రధాని సుల్తాన్‌షారీర్‌కు ఈ ప్రతిపాదనలు అందజేశారు. ఈ సంప్రదింపులపేర భద్రతాసమితి చర్చలో కల్లమాట లతో బెవిన్ లోకాన్ని భ్రమపెట్ట చూచాడు.



బ్రిటిష్ అధికారులు నిషేధించినా లెక్కచేయక
బటేవియాలో స్వతంత్ర ధ్వజస్తంభాన్ని పూజించుతున్న దృశ్యం

ఇందుతోపాటు ఇండొనేషియాలో అతివాదులున్నారని, అహింసా వాదులను అణచక తప్పదంటూ ఒక కొత్తపాట మొదలెట్టాడు. అది కుదరలేదు. ప్రతి పార్టీ ఇండొనేషియా ప్రభుత్వాన్ని బలపరుస్తున్నది. కమ్యూనిస్టులు వ్యతిరేకమని సామ్రాజ్యవాదుల ఏజంటు రాయిటర్ వార్తా ప్రచారానికి ప్రారంభించాడు. టాన్‌మలక్కా అనే ట్రాట్స్కీవాది అనుచరులు డాక్టర్ షారీర్‌ను ఎత్తుకొనిపోగా కమ్యూనిస్టులని వాపో యాడు. టాన్‌మలాక్కా పచ్చి ట్రాట్స్కీవాది అని, కమ్యూనిస్టుపార్టీతో ఎలాటి సంబంధం లేదని లోకం తెలుసుకుంది.

ఫిబ్రవరి ఆఖరున జాతీయమహాసభ డాక్టర్ షారీర్ సంప్రదింపులు నడపాలని తీర్మానించింది. షారీర్ ప్రప్రథమంగా ఇండొనేషియా ప్రభుత్వాన్ని, స్వతంత్రాన్ని గుర్తించాలన్నాడు.

సామ్రాజ్యవాద ప్రభుత్వాలు రెండు కలిసి పంపిన ప్రతిపాదనలు దాటితేగానిరాజీఅయ్యేట్టు సరుఆర్చిబాల్డుక్లార్కు కెర్‌కు కనిపించలేదు. అందు వల్ల సంప్రదింపులను ఆపి లండన్‌కు పరుగెత్తాడు. '46 ఏప్రిల్ 12వ తేదీన డచ్చి ప్రధాని షెర్మర్‌హారన్, డచ్చి విదేశాంగమంత్రి వాన్‌మూక్ లండన్‌లో దిగారు. కొత్త ప్రతిపాదనలు తయారుచేశారు. ఆ ప్రతిపా దనలిలా ఉన్నాయి.

జావాలో ఇండొనేషియా రిపబ్లిక్కును వస్తుతః ప్రభుత్వంగా అంగీకరిస్తారు. కాని మిగత బ్రిటిష్ ఆక్రమితప్రాంతాల్లో ఇండొనీషియా అధికారాన్ని గుర్తించరు. ఇండొనేషియా ఫెడరేషన్ స్వపరిపాల ప్రాంతంగా ఉంటుంది ఫెడరేషన్‌లోని భాగాలన్నీ నెదర్లాండు (డచ్చి) సామ్రాజ్యంలో భాగాలుగా ఉంటాయి. అంతేకాని అవి రిపబ్లిక్కులో చేరవు. డచ్చి తిరిగి ఇండొనేషియా ఫెడరేషన్, కామన్వెల్తులో భాగ ముగా ఉండాలి.

కేవలం పలుకుబడిలేని కొందరి పన్నాగమని అంటున్న ఇండొ నేషియా రిపబ్లిక్కును అంగీకరించకతప్పలేదు. కాని జావాద్వీపంలో మట్టుకు వీరి అధికారం ఒప్పుకొని చుట్టూ తామాక్రమించుకుంటే త్వర లోనే ఇండొనేషియా ఐక్యతను విచ్ఛిన్నం చేసి రిపబ్లిక్కును దుర్బల పరచవచ్చునని సామ్రాజ్యవాదులు ఎత్తువేశారు. ఇండొనేషియాను ఒకే భాగంగా ఉండనివ్వకుండా విభజించాలనే వీరికుట్ర.

(3)

డచ్చిపార్లమెంటులో 'మే' మొదటివారం ఇండొనేషియా సమస్యపై తీవ్రంగా చర్చసాగింది. మొండిఘటాలందరు అసలు ఇండొనేషియా స్వతంత్రవాదులతో సంప్రతింపులే కూడదన్నారు ఆఖరుకు డచ్చి ప్రభుత్వం ఇండొనేషియా రిపబ్లిక్కుతో సంప్రతింపులు జరపాలని మే 8వ తేదీన ప్రకటించింది. వెంటనే 14 తేదీన సైనికచట్టంలో మార్పు చేశారు. డచ్చి సోల్జర్లను వారి అనుమతిలేకనే ఇండొనేషియాకు పంపడానికి ఆ చట్టం అవకాశమిచ్చింది. ఇలా ఒకవేపు సంప్రతింపులు, మరోవేపు దమనసీతి జరపాలని చూచారు.

ఆంగ్లో-డచ్చి ప్రతిపాదనలు సంతృప్తికరంగాలేవని మే 24 తేదీ డాక్టర్ షారీర్ ప్రకటించాడు. కేర్ అధ్యక్షతను జరిగిన పూర్వపు సంప్రతింపుల్లో తేల్చుకున్న సంగతులకుకూడా ఇవి విరుద్ధమన్నాడు. ఏలాంటి రాజీకిగాని, స్వతంత్రం ముందు గుర్తించాలంటూ ఈ ప్రతిపాదనలు కొత్త కవరు తగిలించిన పాతబేరాలేలని ఆయన అన్నాడు.

1946 జూన్ 30 తేదీ ఇండొనేషియా ప్రభుత్వం తానే కొన్ని ప్రతిపాదనలు తయారుచేసి ప్రకటించింది. వాని సారాంశమిది.

"సంపూర్ణ స్వతంత్రాన్ని ఇండొనేషియా యావత్తును గుర్తించాలి. రిపబ్లిక్ ప్రభుత్వం జావా, మదుర. సుమత్రాలలో సంపూర్ణాధికారంలోవుంది. మిగరాచోట్ల (బోర్నియా, సెలెబస్ మలుక్యాస్ మొదలైన దీవులు) కూడ రిపబ్లిక్ అధికారాన్ని డచ్చి గుర్తించాలి. ఇండొనేషియా యావత్తూ స్వతంత్రదేశమని అంగీకరించాలిగాని కేవలం జావా సుమత్రాలు కాదు."

"ఇప్పుడు డచ్చి జోక్యంవల్ల బోర్నియో మొదలైన దీవుల్లో మా పాలన సరిగా ఏర్పడలేదు. అక్కడ మిత్రరాజ్యాలూ మేమూ కలసి పాలన ఏర్పరచాలి. కాని అక్కడ ప్రజాస్వామ్యసూత్రాలపై ఎన్నికలు జరగాలి. క్విస్లింగులనుతెచ్చి పాలన ఏర్పరచడానికి మేము అంగీకరించము. అలా ఎన్నుకొనబడిన ప్రతినిధులు రిపబ్లిక్కులో చేరుతామని ప్రకటించే హక్కువుండాలి. ఒకవేళ వారికిష్టంలేకపోతే మూడేళ్ళు తర్వాత అక్కడ ప్లెబిసైట్ (ప్రజల ఓటుకు) పెట్టి రిపబ్లిక్కులో చేరడమా, లేదా నిర్ణయించ వచ్చును. కాని డచ్చి అధికారంక్రింద ఈఎన్నిక జరగదు.

"ఇవి అంగీకరిస్తే వివరాలు తర్వాత మాట్లాడుకోవచ్చును"

ఈ కోరికలు డచ్చి అంగీకరించలేదు. సంప్రతింపులు రెండోతూరి కూడ విఫల మయ్యాయి.

ఇక డచ్చి ఏజంటు వాన్ మూక్ ఎలాగో ఇండొనీషియాను విభజించాలనుకున్నాడు. ఏదో ఒక విధంగా బోర్నియో సెలెబస్, మలుక్కాస్ దీవులలోని తమ కీలుబొమ్మలను చేర్చి జులై 15 తేదీ ఒకసభ (మాలినోసభ) ఏర్పరిచాడు. జావా ద్వీపనాయకులు మాత్రమే రిపబ్లిక్కులో ఉన్నారని ప్రపంచాన్ని మభ్యపెట్టాలని చూచాడు.

ఆంగ్లో-డచ్చి ఉద్యోగులు పశుబలంతో కొన్నిచోట్లపట్టుకే తాపు కల్పించుకున్నారు. కాని ఇండొనేషియా ప్రజానీకమంతా రిపబ్లిక్ వెనక నిలచి ఉన్నది.

జులై 23 వ తేదీ డచ్చి రాణి తిరిగి తన డిసెంబర్ ప్రకటననే కొత్తమాటల్లో చెప్పింది. సామ్రాజ్యంలో ఒక భాగంగా ఇండొనేషియా స్వపరిపాలితంగా ఉండాలన్నది. కాని ప్రజలెవరూ ఆమాట వినిపించుకో లేదు.

డచ్చివారు సెలెబస్ దీవులలో ప్రజానాయకులను అరెస్టుచేసి అంతా మాదే అనుకున్నారు. కాని అగస్టు 11 తేదీ డచ్చి మిలిటరీ కాంపు (మాలినో సభ జరిగిన ప్రాంతంలో) పై వెయ్యిమంది విప్లవ కారులు దాడిచేశారు. 12 మంది విప్లవకారులను డచ్చి అధికారులు కాల్చారు. ఈ సంగతిని డచ్చి అధికారే చెప్పాడు. అంతేగాక అగస్టు 20 తేదీన డచ్చిలధికారి ప్రకటనచేస్తూ, బోర్నియో, సెలెబస్, బలిమొదలైన దీవులలో అగస్టు 17 వ తేదీని రిపబ్లిక్కు-దినోత్సవం ప్రజలు జరిపారని తెలిపాడు.

వీటన్నిటివల్ల, జావా తప్ప మిగతా ఇండొనేషియాదీవుల్లో రిపబ్లిక్కు-కు బలంలేదన్నమాట వట్టిదని తేలిపోయింది.

అగస్టు 29 తేదీ బ్రిటిష్ స్పెషల్ కమీషనర్ (ఆగ్నేయాశియా) కెల్లర్న్ జాక్లకర్తాకువచ్చాడు. ఇండొనేషియా ప్రధానితో సంప్రతించాడు. వారు చర్చించిన అంశాలు ఇవి : (1) యుద్ధ విరమణ (2) మిత్రరాజ్య ఖైదీల విడుదల (3) ఇండొనేషియాలోని ఇండియన్, చైనీయులరక్షణ, అంటే తిరిగి ఏదో విధంగా రాజీ జరగాలని - పేరుకు స్వతంత్రమని

రిపబ్లిక్కును లొంగిపోయేట్టు చేసి ప్రజాబలాన్ని విచ్ఛిన్నం చేయాలని బ్రిటన్ పూనుకుంది. దీనికి కారణాలివి :

డచ్చివారెంత బలప్రయోగంతో సాధించాలనుకున్నా సాగలేదు. బ్రిటన్ తన సేనలను ఉపసంహరించుకోక తప్పనిస్థితి ఏర్పడుతున్నది. భారతసేనలను ఇండొనేషియా స్వతంత్ర పోరాటంపై ఉపయోగించారని బ్రిటన్ను భారతనాయకులందరూ గర్హించారు. అందులో నవంబర్ ఆఖరుకు భారతసైన్యం ఉపసంహరింపబడుతుందని అకిన్‌లెక్కు స్టేట్ కౌన్సిల్ (ఢిల్లీ)లో ప్రకటించాడు. ఇందువల్ల బ్రిటిష్‌సేనలు ఇండొనేషియా వదిలేలోగా ఎలాగో రాజీకుదిరించాలి. డచ్చిపాలనను ఏదో ఒక రూపంతో ఏర్పరచాలి. తద్వారా తనకు కావలసిన ముడిసరుకులను ఇండొనేషియానుండి రాబట్టుకోవాలి. ఇదీ బ్రిటన్ దురుద్దేశం.

ఇందులోపాటు హాలండులో ప్రజాఉద్యమం, ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చింది. ఇండొనేషియా ప్రభుత్వంతో రాజీ చేసుకోవలసిందని, డచ్చి వలస విధానాన్ని తీవ్రంగా ఖండిస్తూ ఆంస్టర్‌డామ్‌లో సెప్టెంబరు 24 (1946)న బ్రహ్మాండమైన సమ్మెజరిగింది. పట్టణంలోని యావత్తు కార్మికులు సమ్మెచేశారు. పోలీసు, మిలిటరీ కాల్పులు జరిగాయి. డచ్చి కమ్యూనిస్టుపార్టీ ఈ ప్రదర్శనాన్ని ఏర్పరచింది.

కడకు జావాకు పంపనున్న సైనికులు ఓడ నెక్కమని సమ్మెచేశారు. కమ్యూనిస్టు సభలను ప్రభుత్వం నిషేధించింది. ఏమైనా డచ్చి మంత్రి జాంక్‌మాన్ రేడియోలో ఇలా చెప్పక తప్పలేదు.

"మేము డచ్చి ఇండొనేషియా సమస్యను శాంతంగా పరిష్కరించి సంధి చేసుకునేందుకు సిద్ధంగా ఉన్నాము...." "ఇండొనేషియన్ల స్వతంత్ర వాంఛను బలప్రయోగంతో అణచడం మాకు సమ్మతంకాదు."

ఇలా ఎటుచూచినా వస్తున్న సామ్రాజ్య వ్యతిరేక శక్తులవల్ల హాలండుకూడ సంప్రతింపులకు సరేననవలసివచ్చింది. బ్రిటన్ మద్దతుతో డచ్చిప్రభుత్వం మూడోతూరి అక్టోబరు 7 (1946) తేదీన ఇండొనేషియా ప్రభుత్వంతో రాయబారాలు ఆరంభించింది.

ఈ సంప్రతింపుల వివరాలు పూర్తిగా ప్రకటితం కాలేదు ఆఖరున అక్టోబరు 14వ తేదీ ఈ సంప్రతింపుల ఫలితంగా ఆంగ్లో డచ్చి సేనలకు - ఇండొనేషియా సైన్యాలకు మధ్య జరుగుతున్న యుద్ధం విరమించబడినట్టు అధికార ప్రకటన జరిగింది.

# 8. పోరాట మింకా ముగియలేదు

ఇండొనేషియాలో యుద్ధ విరమణ వార్త ప్రకటితమైన కొలది రోజుల్లోనే మరొక రకమైన వార్తలు వస్తున్నవి డచ్చి అధికారులు సేనా సన్నాహాలు విరివిగా చేస్తున్నారని తెలుస్తున్నది

ఈవార్తలే కాదు. మనం ఈసంవత్సరంలో నడిచిన చరిత్రనంతా గమనిస్తే డచ్చి - బ్రిటిష్ సామ్రాజ్యవాదుల కుట్రలు సుబోధకమవుతాయి.

మూడుతూర్లిప్పటికి సంప్రతింపులు సాగించారు. ఆఖరు సంప్రతింపులలో యుద్ధం ఆపడానికి మాత్రం సమాధానం కుదిరింది. కాని ఇండొనేషియా స్వతంత్రాన్ని గుర్తించడం డచ్చికి కాని, బ్రిటన్‌కు కాని అభిమతం కాదు. తొలినుంచీ ఇతర ప్రజాపోరాటాలను అణచాలనుకున్నట్టే అక్కడా వారు ప్రయత్నిస్తున్నారు.

ఈ తాత్కాలిక రాయబాలు, రాజీలద్వారా డచ్చిసేనలు కావలసినన్ని ఇండొనేషియాలో దిగేందుకు ఏర్పాట్లు చేసుకుంటున్నారు. ఈ అక్టోబరు మొదటివారం 'డిసెంబరు, డివిజన్' అనేపేర 25 వేల డచ్చి సైనికులను ఇండొనేషియాకు డచ్చి ప్రభుత్వం పంపింది. బ్రిటిషు సేనలుపోయే లోగా డచ్చిసేనలు కావలసినన్ని చేరాలి. అందుకు తగిన వ్యవధి చిక్కాలి. అందుకనే రాయబారాల నాటకం ఆరంభించారు.

బ్రిటను ఇంతవరకు ఇండొనేసియాలో జరిపిన ఘోరకృత్యాలను మనం సాకల్యంగా పరిశీలించాము. ఇండొనేషియా ప్రజాపోరాటాన్నణచేందుకు 7 డివిజన్ల సేనను బ్రిటను ఉపయోగించింది. 50 లక్షల పౌనులను ఖర్చుపెట్టింది. ఇప్పుడక్కడున్న యావత్తు యుద్ధసామగ్రిని డచ్చివారికి అప్పగించి, డచ్చిద్వారా ఇండొనేషియా సహజసంపత్తిని దోచుకోవాలని బ్రిటను ఉబలాటపడుతోంది. సంప్రతింపులపేర, సంధుల పేర కాలహరణం చేస్తోంది,

కాని ఇండోనేషియా ప్రజలుతమస్వతంత్రాన్ని నిలుపుకొనేందుకు ఎలాంటి త్యాగం చేయడానికైనా సంసిద్ధులుగా ఉన్నారు. ఇంకావారి స్వతంత్ర పోరాటం ముగియలేదు. ఇంకాసాగుతూనే ఉన్నది.

ఇండొనేషియా స్వతంత్రాన్ని భారతదేశంలోని నాయకులందరూ బలపరచారు. నెహ్రూ, జిన్నా, కామ్రేడ్ జోషీలు భారతదేశ ప్రధాన రాజకీయపక్షాలైన కాంగ్రెసు, లీగు, కమ్యూనిస్టు పార్టీల పక్షంగా ఇండొనేషియా స్వతంత్రవీరులను అభినందించారు.

మన దేశంలోని ప్రతిప్రజాస్వామ్యవాదీ నేడు బ్రిటిష్ కుట్రలను గ్రహించాలి. ఇండొనేషియా సోదరప్రజలపై ఉపయోగిస్తున్న భారత సేనను వెంటనే రప్పించమని, నెహ్రూతాత్కాలిక ప్రభుత్వంపై ఒత్తిడి తేవాలి.

మన సోదరప్రజల స్వతంత్రాన్ని గుర్తించి ఆ ప్రభుత్వంతో రాజకీయ సంబంధాలుంచుకొనేట్టు నెహ్రూప్రభుత్వంపై ప్రజలు ఒత్తిడి తేవాలి. తద్వారా ఇండొనేషియా స్వతంత్ర పోరాటాన్ని బలపరచడమే కాదు, మనం చేయగలది; బ్రిటిష్ డచ్చి సామ్రాజ్యవాదుల వలసదేశ పీడనానీతిపైననే దెబ్బతీసినవార మవుతాము.

మన సామ్రాజ్యవాద వ్యతిరేక స్వతంత్ర పోరాటాన్ని తీవ్రం చేయడం, ఇండొనేషియా స్వతంత్ర పోరాటానికి సాయపడడమే.

సామ్రాజ్యవాదాన్ని నాశనంచేయాలి! స్వతంత్రజ్యోతిని వెల్గించాలి! అదే మన కర్తవ్యం!

# 9. సామ్రాజ్యవాదుల దాస్య ప్రణాళిక

## తాజాకలం

ఈ పుస్తకం రాసినతర్వాత కొన్ని సంఘటనలు జరిగాయి. అందులో ముఖ్యంగా డచ్చి-బ్రిటన్ సామ్రాజ్యవాదులు ఇండొనేషియా రాజ్యాంగాని కొక దాస్య ప్రణాళికను తయారుచేశారు డచ్చి, ఇండొనేషియా ప్రతినిధులు అందుకు ఒప్పుకున్నారు; ఆ చిత్తు ముసాయిదా (19-11-46) ప్రకటించబడినది.

తొలినుంచీకూడా సామ్రాజ్యవాదులు రెండోయుద్ధం ముగిసింతర్వాత ప్రజానీకంలో బయలుదేరిన విప్లవజ్వాలలను ఆర్పివేయాలని ప్రజా ఉద్యమాలను విధ్వంసం చేయాలని తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు.

యూరపులో ఫాసిజ విధ్వంసనంతో ప్రజాతంత్రశక్తులన్నీ మహోద్యమాలు సాగించి ప్రజారాజ్యాలను స్థాపించసాగాయి. (యుగోస్లావియా, జకోస్లోవేకియా మొదలైనవి ) ప్రపంచ ప్రజాశక్తులకు అండగా సోవియట్ ప్రభుత్వం నిలచి శాంతి సమావేశంలోను, మిత్రరాజ్య సమితిలోను పీడిత ప్రజావాంఛలను బలపరచ సాగింది.

ఆసియాలోని వలస ప్రజలందరూ ఒక్కుమ్మడిగాలేచి సామ్రాజ్యవాద శృంఖలాలను విడగొట్టుకొనేందుకు సమాయత్తులయ్యారు. నానా బాధలకు లోనైన కార్మిక, కర్షక, పీడిత ప్రజలు పోరాటంముందు నిల్చారు. బ్రహ్మాండమైన విప్లవ చైతన్యం ఎటుచూచినా సామ్రాజ్యవాదులకు గుండె దడపుట్టించింది.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు, తమ సామ్రాజ్యాన్ని చెక్కు చెదరకుండా ఉంచుకొని, యధాపూర్వకంగా ఆసియా ముడిసరుకులను కాజేసి, ధనికుల బొక్కసాలు నింపుదామని చూస్తున్నారు. ప్రజాతంత్రశక్తులపై మరొకదాడి చేయడానికి, సోవియట్‌కు వ్యతిరేకంగా దండయాత్ర సాగించడానికి అనువైన కీలకస్థానాలను తమ చేతిక్రిందే ఉంచుకొనేందుకు ప్రయత్నిస్తున్నారు. వారి విధానం ఈ లక్ష్యంతోనే అమలుజరుగుతున్నది.

యూరోపు నూతన ప్రజాతంత్ర రాజ్యాల బలం యెక్కువవుతుండడం చూచారు. వెంటనే గ్రీసులో తమసేనల నుంచారు. ఎవరైతే ఫాసిస్టు రక్కసులను అల్లలనాడించి రెండోయుద్ధంలో ప్రజారాజ్య రక్షణకు రక్తం ధారవోశారో వారిపైనే దాడి చేయసాగారు. ఆ దేశంలోని అభివృద్ధినిరోధక శక్తులను కూడదీసుకొని, విప్లవోద్యమాలను అణచివేయాలని చూస్తున్నారు. కాని విప్లవవీరులు ఒకేధాటితో ప్రజారాజ్య స్థాపనకు పని చేస్తూనే ఉన్నారు.

మధ్యప్రాచ్యంలో, సోవియటుపై దాడికి తగిన కీలకస్థానాలను ఏర్పరచుకొని, అక్కడి ప్రజా వుద్యమాలను అణచి, మధ్యయుగపు భూస్వామ్య పద్ధతిని కొనసాగించాలని తీవ్రంగా బ్రిటన్ పనిచేస్తోంది. ఇరాన్‌లోని ఆంగ్లో-ఆయిల్‌కంపెనీ యజమానులను, కొండజాతి నాయకులలో కొందరినీ జతచేసుకొని, ప్రజాతంత్ర శక్తులపై దెబ్బతీస్తున్నది. అలాగే పాలస్తీనా, ఇరాక్, ఈజిప్టుమొదలైన దేశాలన్నింటా, తనసైనిక

కీలకస్థానాలకై ప్రాకులాడుతున్నది. అభివృద్ధి నిరోధకశక్తులను బల పరుస్తున్నది.

మనదేశంలో, బ్రిటిష్ ప్రణాళిక అనే దాస్యప్రణాళికను అమలు జరిపి, దినదిన ప్రవర్ధమానమవుతున్న ప్రజా వుద్యమాలను విచ్ఛిన్నం చేయాలని, తమ తొత్తులైన సంస్థానాధీశ్వరులు, జమీందారీ ధనికవర్గాల పెత్తనం నిలపాలని సాయశక్తులా పోరాడుతున్నది. దేశంలో మును పెన్నడు కనివిని ఎరుగని ఐక్య ఉద్యమాలువస్తుంటే, వానిని విచ్ఛిన్నం చేసేందుకు, కాంగ్రెసు-లీగునాయకత్వాల పరస్పరవైముఖ్యాన్నిఅవకాశంగా తీసుకొని దేశంలో మహత్తర ద్వేషజ్వాలలను రెచ్చగొడుతున్నది. భారతదేశాన్ని తన సామ్రాజ్య దురహంకార దండయాత్రలకు ప్రధాన సైనికకేంద్రంగా తయారు చేసుకుంటున్నది.

అలాగే ఇండొనేషియాలో డచ్చిని ఎటూ తన కీలుబొమ్మగా పని చేయించుకోవచ్చునని, ఆస్ట్రేలియా మార్గాన్ని కాపాడుకొని ప్రాచ్య దేశా లలో వచ్చే ప్రజావుద్యమాలనరికట్టేందుకు కీలకస్థానంగా ఉపయోగించుకో వచ్చునని చూస్తున్నది. ఆ దేశంలోని విపరీత సహజసంపదను కొల్లకొట్టేందుకు తహతహ పడుతున్నది.

బ్రిటన్ జపానుసేనలతో ఆయుధ విసర్జనం చేయించడానికేనంటూ ఇండొనేషియాలో దిగి, అక్కడ ప్రజలేర్పరచుకున్న రిపబ్లిక్కు విధ్వంస నానికి పనిచేసింది. నానారీతుల గ్రామ విధ్వంసనంచేసి ప్రజల రక్తపానం చేసింది. డచ్చి సామ్రాజ్యాన్ని హింసాప్రయోగంతో స్థాపించి, డచ్చి ద్వారా తన పీడనను కొనసాగించాలని సహస్ర విధాలా పనిచేసింది.

కాని ప్రపంచ ప్రజాతంత్రశక్తులన్నీ ఎలుగెత్తి ఆక్షేపించాయి. భద్రతాసమితిలో సోవియట్ ప్రతినిధులు ఈ ఘోరదురంతాలను బట్ట బయలు చేశారు. ఇండొనేషియా ప్రజాశక్తులు నడుంకట్టిపోరాడసాగాయి.

ఇక యథాప్రకారం తమ పాతఆటను సామ్రాజ్యవాదులు మొదలు పెట్టారు. సాధ్యమైతే బలప్రయోగం, కాకపోతే అప్పటి మితవాద నాయకత్వాలతో రాజీ చేసుకోవడం, ఇదీ వీరి ధోరణి కాని ఈ రెండి టికీ ఒకే ప్రధాన లక్ష్యం. అక్కడి ప్రజలకు నిజమైన స్వాతంత్ర్య ముండకూడదు. తమ పీడనకు ఏమాత్రం లోటు రాకూడదు.

ఈ లక్ష్యంతోనే బ్రిటిష్ తన రాయబారులద్వారా సమాధానానికి సంప్రతింపులు సాగించింది. ఇప్పటివరకు జరిగిన ఇండొనేషియాలోని సంప్రదింపుల సంగతులు ముందే మనం తెలుసుకున్నాము.

ఇప్పుడు కడకు ఒక విచిత్రప్రణాళికను తయారుచేశారు. ఈచిత్తు ముసాయిదాను డచ్చి, ఇండొనేషియా పార్లమెంటులు అంగీకరిస్తేనే అమలుజరుప వీలవుతుంది. డచ్చిప్రతినిధులు, ఇండొనేషియారిపబ్లిక్కు ప్రతినిధులు కూడా ఈ చిత్తుముసాయిదాకు అంగీకారం తెలిపారు.

## రాజీ షరతులు

ఈ రాజీ ప్రణాళిక సారాంశం ఈ క్రింద ఇస్తున్నాను—

1. జావా, మదుర, సుమత్రాదీవులలో ఇండొనేషియా రిపబ్లిక్ ప్రభుత్వాన్ని డచ్చి ప్రభుత్వం గుర్తిస్తుంది. ఇందులో ఇప్పుడు మిత్రరాజ్యసేనలుగాని, డచ్చి సేనలుగాని ఆక్రమించిన ప్రాంతాలను పరస్పర సహకారంద్వారా, క్రమంగా రిపబ్లిక్ ప్రాంతంలోకి చేర్చబడాలి. ఈపని 1949 జనవరిలోగా జరగాలి.

2. డచ్చి ప్రభుత్వమూ, రిపబ్లిక్ ప్రభుత్వమూ కలసి, ఫెడరల్ పద్ధతిలో, యునైటెడ్ స్టేట్సు ఆఫ్ ఇండొనేషియా అనే ప్రభుత్వాన్ని త్వరలో స్థాపించాలి.

3. యునైటెడ్ స్టేట్సు ఆఫ్ ఇండొనేషియాలో డచ్చి ఈస్టు ఇండీసులోని ప్రాంతాలన్నీ చేరాలి. కాని ఏప్రాంతాల లోని ప్రజలైనా ఇష్టపడకపోతే వారు రిపబ్లిక్కు, డచ్చి ప్రభు ప్రభుత్వాలతో ప్రత్యేక సంబంధం ఉంచుకోవాలి.

4. ఇండొనేషియా సంయుక్తరాష్ట్రాలలో - రిపబ్లిక్కు, బోర్నియో, గ్రేట్ ఈస్టు చేరుతాయి. రాజధాని విషయం వారు ఆలోచించుకోవచ్చు.

5. ఈ సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగాన్ని రిపబ్లిక్కు, మిగత భాగాల ప్రభుత్వాలు నామినేట్ చేసిన ప్రతినిధులతో ఏర్ప

డిన ప్రజా పరిషత్తు నిశ్చయిస్తుంది. ఈనామినేషన్ల విషయంలో ఎవరెవరెలా ప్రాతినిధ్యం వహించాలన్నది, రిపబ్లిక్కు, డచ్చి ప్రభుత్వం, వీనిలో సరైన ప్రాతినిధ్యంగల ఇతర ప్రజలు కలిసి ఆలోచించి చెయ్యాలి.

6. ఇక ఇండొనేషియా హాలెండు ప్రభుత్వాలు కలిసి నెదర్లాండ్సు యూనియన్ అనేప్రభుత్వాన్ని ఏర్పరచాలి. ఇందులో ఒకటి : డచ్చి సామ్రాజ్యం - సూరినమ్ కురకావా (అంటే దక్షిణ అమెరికామొదలు తూర్పుననున్న డచ్చివలసలు హాలందు, కూడా) హాలెండులు, రెండు : ఇండొనేషియా సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వం చేరాలి. కాని హాలెండు ప్రభుత్వం సూరినమ్ కుర కావాలతో ఇంకొకవిధమైన సంబంధాలు పెట్టుకోడానికి ఏమీ ఆక్షే పణ ఉండకూడదు.

7. ఈ యూనియన్ ప్రభుత్వసంస్థలు ఏర్పడాలి. వానిని ఇండోనేషియా డచ్చిప్రభుత్వాలు కలిసి ఏర్పరుస్తాయి. విదేశాంగ శాఖ, రక్షణ, అవసరమైనంతవరకు ఆర్థికశాఖ, ఇక సంస్కృతీ ప్లానింగు మొదలైనవన్నీ ఉమ్మడిగా చూడాలి.

8. ఈ ఉమ్మడిశాఖలన్నీ ఈ యూనియన్‌కు అధిపతి అయిన రాణీగారి చేతిలో ఉండాయి. వీనికి సంబంధించిన ఉత్త ర్వులు రాజు (రాణి) పేర యూనియన్ ప్రభుత్వం ప్రకటిస్తుంది.

9. ఇండొనేషియా - డచ్చి యూనియన్ రాజ్యాంగంలో రెండుపార్టీల హక్కులకు ప్రత్యేక రక్షణలు కల్పింపబడతాయి. రెండు ప్రాంతాల ప్రజలకు పౌరహక్కు ఉంటుంది. ఒకవేళ ఏ విషయంలోనైనా రెండు పార్టీలకు సమాధానం కుదరకపోతే, ఏం చేయాలనేది కూడఅందులో ఉంటుంది.

10. ఈ నిబంధనలను, ఇండొనేషియా సంయుక్త రాష్ట్రాల ప్రతినిధులు, హాలెండు ప్రభుత్వప్రతినిధులు కలిసిన సభ తయారుచేస్తుంది.

11. ఇండొనేషియా సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వాన్ని,

నెదర్లాండ్సు ఇండొనేషియా యూనియన్ ప్రభుత్వాన్ని 1949 జనవరి 1 లోగా ఏర్పరచేందుకు పనిచెయ్యాలి.

12. రిపబ్లిక్ ప్రాంతంలోని ఇండొనేషియాకు చెందని విదేశీయుల హక్కులను పునరుద్ధరించి' వారి ఆస్తిపాస్తులను తిరిగి ఇప్పించేందుకు వెంటనే డచ్చి ప్రభుత్వం, రిపబ్లిక్కు కలిసి సంయుక్త కమిటీని వెయ్యాలి.

13. వెంటనే రెండు ప్రభుత్వాలు తమ సైన్యాలను తగ్గించుకోవాలి. ఇద్దరు ఈ విషయంలో కలిసి ఆలోచించాలి.

14. ఈఒడంబడికలో విభేదాలేర్పడితే పరిష్కారసంఘం ద్వారా తీర్చుకోవాలి. ఆ పరిష్కారసంఘం ఇద్దరూ కలిసి ఏర్పర చాలి. దాని అధ్యక్షుడు వేరే దేశీయుడుగా ఉండాలి. అదీ కుదరక పోతే అంతర్జాతీయ కోర్టు అధ్యక్షుడికి ఇది అప్పగించాలి.

## వట్టి వంచక సూత్రాలు

ఇవన్నీ చదివితే మనకు స్పష్టంగా గోచరించే మొదటివిషయం, డచ్చిసామ్రాజ్యంపేరు మారుతుంది. ఇండొనేషియా అందులో భాగం గానే ఉంటుంది అనేది.

రిపబ్లికు ప్రభుత్వాన్ని, జావా సుమత్రా మదురా దీవులలో గుర్తి స్తామని తొలినుంచి చెప్పిన పాతపాటే. ఇప్పుడుకూడ ఇదే. ఇండొ నేషియాను చీల్చి, రిపబ్లిక్కు ప్రాంతంచుట్టూ డచ్చి సామ్రాజ్యాన్ని సేనలను అలాగే ఉంచి కీలకస్థానాలను చేతబట్టుకొనేందుకు డచ్చి చేస్తున్న ప్రయత్నం ఇందులో దాగాకొనసాగింది. ఈ మూడు దీవులు తప్ప మిగతావి డచ్చి అధికారుల కిందే ఉంటాయి.

ఇక ఇవన్నీ కలిసి ఏర్పడే ఇండొనేషియా సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వం ఎలాఉంటుందో మనం ఊహించుకోవచ్చు మిగతా దీవులలో డచ్చి సామ్రాజ్యవాద ప్రభుత్వం ప్రజా ఉద్యమాలను అణికట్టివేస్తున్నది. కేవలం తమ జోహుకుం వాలాలనే ప్రజాప్రతినిధులంటుంది.

ప్రజాపరిషత్తనే మాట ఉపయోగించినా, అసలది కేవలం నామి నేటెడ్ సభ. రిపబ్లిక్కు కొందరిని నియమిస్తుంది. కాని మిగత దీవుల

నుండి వచ్చేవారందరిని డచ్చి ప్రభుత్వం నియమిస్తుంది. వీరందరూ ఒక సభలో చేరి రాజ్యాంగం నిర్ణయించాలి. అంటే ఈ సభలో తనవారికి తగిన స్థానం డచ్చివాగా ఏర్పాటు చేసుకున్నదన్న మాట. అంటే అసలు ఇండొనేషియా యీ సంయుక్త రాష్ట్రప్రభుత్వంలోనే డచ్చి జోక్యం. పలుకుబడి బాగా వుంటుంది.

ఇలాంటి సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వం చేతిలోను విదేశాంగశాఖ, రక్షణశాఖ, ఆర్థికశాఖ (అవసరమైనంత) ఉండవు. అంటే ఇది నామ మాత్రమైన ప్రభుత్వం అవుతుంది.

పై ప్రధాన శాఖలన్నింటికి నెదర్లాండ్సు ఇండొనేషియన్ ఆధిపత్యం వహిస్తుంది. డచ్చి సామ్రాజ్యం (హాలెండు, సూరిణమ్ కారికూవా దీవులు) యావత్తున్నూ, ఇండొనేషియా సంయుక్తరాష్ట్రాలును కలసి ఈ యూనియన్‌ను ఏర్పరుస్తాయి. అంటే ఇందులో పూర్తిగా డచ్చి సామ్రాజ్యవాదుల ప్రాబల్యం ఉంటుంది. ఏమాత్రం ప్రజాస్వాతం త్ర్యంలేని, వలసపాలనలోవున్న దీవులలోని తమ తొత్తులను అక్కడి ప్రతినిధులంటూ డచ్చి ప్రభుత్వం తెస్తుంది. వీరందరు కలసిన ఈ యూని యన్‌లో రిపబ్లిక్‌వాణి బయటకి వినిపించడమే కష్టమవుతుంది.

ఇలాంటి యూనియన్ ప్రధానమైన విదేశాంగ, రక్షణ, ఆర్థికశాఖ లను చేతబట్టుకుంటుంది. అంటే పరిపూర్తిగా ఆయువుపట్టులన్నీ డచ్చి సామ్రాజ్యవాదుల హస్తగత మయిపోయాయన్న మాట.

ఇండొనేషియా రిపబ్లిక్కుకు ఇక స్వతంత్రం ఏముందో కించిత్తు ఆలోచించినా తెలిసిపోతుంది. విదేశ రాజ్యాంగనీతిని వీరు నిర్ణ యించలేరు. తమ దేశరక్షణను చూచుకోవీల్లేదు. తమ ఆర్థికవిషయా లలో ముఖ్యమైన హంశాలు ప్లానింగు, దేశాన్ని పరిశ్రమమయంగాచేసి, అభ్యుదయ పంథాలో నడపడం వగైరాలకు స్వతంత్రముండదు.

ఇంతకూ వచ్చిన స్వతంత్రం, జావా, మదుర, సుమత్రాలలో పరి పాలన. అదికూడ సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వం ఏర్పడిలే దానిజోక్యం బాగా ఉంటుంది. ఆ సంయుక్తరాష్ట్ర ప్రభుత్వంలో రిపబ్లికు ప్రతినిధులే గాక, డచ్చి పాదాక్రాంత ప్రాంతాలనుండి డచ్చి సామ్రాజ్యవాదులు నియ మించేవారుకూడ ఉంటారు.

డచ్చి ఖూనీలు

ఇదెంత బూటకమో, మోసమో, ఈ ఒడంబడిక ప్రకటించిన రోజే వచ్చిన మరో వార్త తెలుపుతుంది. ఎవరో తమ సేనానివేశాలపై కాల్చారన్న సాకుతో బూటంజోర్గు అనేచోట నవంబరు 17 (1946) తేదీ ఉదయం డచ్చిసైనికులు ప్రజలపై దాడిచేశారు. స్వేచ్ఛగా కాల్చారు. అందులో 6 మంది ఇండొనేషయన్లు మరణించారు. 7 గురు తీవ్రంగా గాయపడ్డారు. 110 మందిని డచ్చిసైనికులు అరెస్టు చేశారు.

ఈ వార్తలోని దారుణ పిశాచతాండవం చూడండి. ఒకవేపు ఇండొనేషియాకు స్వతంత్రమిచ్చినామంటూ, మరోవైపు అమాయక ప్రజలను తమ పొట్టపెట్టుకుంటున్న ఈకిరాతకుల నేమనాలి!

అంతా పచ్చిమోసం. ఈప్రణాళికలో ఏమాత్రం స్వతంత్రంలేదు. డచ్చి దాస్యాన్ని శాశ్వతంగా ప్రజలపై రుద్దడానికి బందోబస్తు చేయడమే ఈ ప్రణాళికలో జరిగింది.

తమదేశ స్వతంత్రంకోసం, నానా బాధలుపడి, రక్తప్రవాహాలతో డచ్చిసామ్రాజ్యవాద కలుషాన్ని, కశ్మలాన్ని కడిగివేసిన ఇండొనేషియా పీడిత ప్రజానీకం ఈవంచనలో పడిపోరాదు. పడిపోరు.

మితవాద నాయకత్వాలు అవలంబించే రాజీ పంథాలను, కార్మిక కర్షక ప్రజాశక్తులు ఏకమై ఓడించాలి. సామ్రాజ్యవాదాన్ని సరిహద్దుల్లో లేకుండా నిర్మూలించాలి. అందుకై వెనుకంజవేయక తమ కార్యక్రమం సాగించాలి. తాత్కాలికంగా దేశంలోని పైవర్గాలవారిని మభ్యపెట్టినా ఈ ప్రణాళికలోని దాస్యాన్ని ప్రజాకోటి గ్రహించి తీరుతుంది. దాస్య విచ్ఛిన్నానికై పోరాడితీరుతుంది. ఇండొనేషియా స్వతంత్రభానూదయం మేఘాచ్ఛాదితం కారాదు. సామ్రాజ్యవాదచ్ఛాయలు దానిని ఆక్రమించ కూడదు.

వారితోపాటు మనంకూడ జతచేరి, యావత్ పీడిత ప్రజాకోటి. సామ్రాజ్యవాదాన్ని కూకటివేళ్ళతో కూలద్రోసేందుకు పనిచేయాలి.

నేడు ప్రపంచ పీడిత ప్రజాకోటి ఉవ్వెత్తునలేచి, ఏకధాటితో, ఏకకంఠంతో, స్వతంత్రంకోసం, సౌభాగ్యంకోసం, ప్రజాతంత్రంకోసం, సామ్రాజ్యవాదాన్ని, జమిందారీ ధనిక వర్గాల పునాదులను కదల్చి విదిల్చి

వెయ్యడంకోసం జయశంఖం పూరించింది. పోరాటం మొదలెట్టింది. ఆపోరాటాన్ని విజయంవరకు కొనసాగిస్తుంది.

అదే ప్రపంచ పీడిత మానవ హృదయంలోని ఆశాజ్యోతిని వెలుగిస్తున్నది.

అ ను బం ధం

# ఇండొనేషియా స్వతంత్రసంఘ విజ్ఞప్తి

పండిట్ నెహ్రూను ఇండొనేషియాకు రమ్మని డాక్టర్ సోకర్నో (ఇండొనేషియా రిపబ్లిక్ అధ్యక్షుడు) ఆహ్వానించినపుడు నెహ్రూ ఇలా జవాబు చెప్పాడు.

"ఇండొనేషియా స్వాతంత్ర్యానికి నేనేమైనా ఉపకరిస్తే, ఇండియాలో ఎంత అర్జంటు పనివున్నా, ఎంత ఒత్తిడివున్నా నేను జావాను సందర్శించ కుతూహలపడుతున్నాను."

(లక్నోలో 1945 అక్టోబరు 8 న నెహ్రూ)

"ఇండొనేషియా రిపబ్లిక్‌ను వెంటనే గుర్తించాలని నేను భావిస్తున్నాను. మేము సోకర్నో ప్రభుత్వాన్ని బలపరచుతున్నాం."

(జయపూరులో 1945 అక్టోబరు 21 న నెహ్రూ)

ఇండొనేషియా ప్రజలకు భారతదేశ ప్రముఖ కాంగ్రెస్ నాయకుని నుండి వెలువడిన ఈ వాక్యాలు ఎంతో ఉత్సాహాన్ని ఇచ్చాయి. నెహ్రూ ఈ పల్కులు పల్కిన దాదాపు సంవత్సరానికి కేంద్ర ప్రభుత్వపు గద్దె నెక్కాడు. కాంగ్రెస్ తాత్కాలిక ప్రభుత్వంలో చేరిన రోజుననే - సెప్టెంబరు 2 వ తేదీన - భారతదేశంలోని ఇండొనేషియా ప్రజల స్వతంత్ర సంఘం, నెహ్రూకూ, దేశరక్షణశాఖ మంత్రి బలదేవ్‌సింగు ఒక మెమోరాండం సమర్పించింది.

ఇందులో, ఇండియాలో ప్రధాన రాజకీయపార్టీ అయిన కాంగ్రెస్ తాత్కాలిక ప్రభుత్వంలో చేరినందుకు అభినందించింది. గత సంవత్సరమంతా ఇండొనేషియాను అణచడానికి ఆంగ్లో - డచ్చి సామ్రాజ్యవాదులకు భారతదేశ సేనలు, భారతదేశ సాధనాలు, ఎలా ఉపయోగించబడ్డాయో తెలియజేసింది.

ఇండొనేషియా రిపబ్లిక్‌ను గుర్తించాలని, అచటనుండి భారత దేశ సేనలను తిరిగి వెనక్కి రప్పించాలని, కాంగ్రెస్, లీగ్, కమ్యూనిస్టు పార్టీ, ఆలిండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ఎలా ఆందోళన చేశాయో, మెమోరాండం క్లుప్తంగా జ్ఞప్తికి తెచ్చింది.

ఆకిన్‌లెక్ జులై నెలాఖరుకు భారతదేశ సేనలను భారతదేశానికి రప్పించుతానని, కేంద్రశాసనసభలో, హిందూముస్లిం సభ్యుల ఐక్య వాంఛను ఎదిరించలేక వాగ్దానం చేయవలసివచ్చింది. కాని ఇంతవరకా వాగ్దానం చెల్లింపబడలేదని మెమొరాండం హెచ్చరించింది. మెమొరాండంలోని కోర్కెలివి ;

"(1) ఇండొనేషియా రిపబ్లిక్‌కు గుర్తించాలి. (2) రాజకీయ సంబంధాలను స్థాపించుకోవాలి. భారతదేశ ప్రతినిధులను మా దేశం పంపాలి. మా దేశ పరిస్థితులను విశదం చేసేందుకు మా దేశ ప్రతినిధులను ఇండియాకు రానీయాలి. (3) జపాను ఆక్రమణ కాలంలోను, ఆ తర్వాత ఆంగ్లో-డచ్చి సామ్రాజ్యవాదుల జోక్యంవల్లను, మా దేశం దిగ్బంధం చేయబడింది. తక్కిన ప్రపంచముతో సంబంధం లేకుండా పోయింది. ఈ ఆర్థిక దిగ్బంధనాన్ని సడలగొట్టాలి. జాతీయ నిర్మాణానికి అవసరమైన సామగ్రిని సహాయం చేయాలి. ఇండియాలోకూడ యంత్రవస్తువులు ఎక్కువలేకపోయినా, మారబ్బరుసు, టీని, కాఫీని, నూనెను, క్వినైన్‌ను ఉపయోగించుకొని వాటికి బదులు యంత్రసామగ్రి వగైరా ఈయాలని కోరుతున్నాం (4) ఇండొనేషియాకు, ఇండియాకు బియ్యపు ఒడంబడిక జరిగింది. గ్రామాలనుంచి ధాన్యం సేకరించేందుకు ఇండియా ప్రభుత్వం మోటార్ ట్రక్కులు మొదలయినవి సప్లయిచేయాలి. కాని ఇప్పుడల్లా సప్లయి చేయడంలేదు. బటేవియాలోని బ్రిటిష్ కార్యాలయోద్యోగులను ఈ విషయమై హెచ్చరిస్తూ జాతీయ ప్రభుత్వం సూచనలీయాలి. (5) ఇండొనేషియానుండి సేనల నన్నిటినీ వుపసంహరింపచేయాలి. ఆంగ్లో - డచ్చి సామ్రాజ్యవాదులను బలపరచడానికి భారతీయ సైనికుడు గానీ, వుద్యోగి గానీ పని చేయనీయకుండా చూడాలి ఆంగ్లో - డచ్చి సేనలను తీసుకువచ్చే నౌకలకు ఇండియా రేవులలో ప్రవేశం ఈయకూడదు. డచ్చివారు కలకత్తా విమానాశ్రయాన్ని గాని, మరొకదానిని గాని, వుపయోగించకుండా జాగ్రత్త

పడాలి. (6) త్వరలో జరగనున్న మిత్రరాజ్యసమితి జనరల్ అసెంబ్లీకి, భారతదేశ నిజప్రతినిధులు వెళ్ళనున్నారు. మాకు ప్రపంచంతో సంబంధంలేదు. మేం మిత్రరాజ్యసమితిలో సభ్యులంకావాలని ఎంతో కోరిక ఉన్నా రాలేకపోయాం. కాబట్టి మా స్వాతంత్ర్య విషయమై మిత్ర రాజ్యసమితిలో పెట్టేవారెవరూలేరు. ఇండొనేషియా స్వాతంత్ర్యాన్ని గుర్తించాలని, దానిని మిత్రరాజ్యసమితిలో చేర్చుకోవాలని డచ్చి-ఇండొనేషియా వ్యవహారాలను శాంతియుతంగా పరిష్కరించాలనీ, కోరుతూ భారతదేశ ప్రతినిధులు మిత్రరాజ్యసమితిలో మాతరపున మాట్లాడుతారని ఆశించుతాం. ప్రస్తుత ఇండొనేషియా—డచ్చి రాయబారాలు జయప్రదం అవుతాయని మాకు ఆశలేదు. ఇండొనేషియా పరిస్థితులను విచారించడానికి ప్రజాతంత్ర ప్రభుత్వాలతో గూడిన ఒక కమిటీని వేయమని భారత దేశ ప్రతినిధులు కోరుతారని ఆశించుతాం. (7) మా దేశంలో డాక్టర్లూ, వైద్యసామగ్రి, మందులూ చాలా కొరతగా ఉన్నాయి. చైనా, మలయాలకు కాంగ్రెసు వైద్యదళాలను పంపింది. జాతీయ ప్రభుత్వం మా దేశానికికూడ ఒక వైద్యదళాన్ని పంపాలని ప్రార్థించుతున్నాం.

"శతాబ్దాలక్రింద పశ్చిమదేశ సామ్రాజ్యవాదులు మన ఉభయదేశాలనూ తమ పాదాక్రాంతం చేసుకొనేముందు మన రెండుదేశాల ప్రజలూ సామరస్యంతో సోదరులలా మెలిగారు. మిమ్ములనూ, మమ్ములనూ బానిసలు చేసిన ఆ సామ్రాజ్యవాదులు మనలను విడగొట్టి దూరంగా ఉంచ ప్రయత్నించారు.

"కాని ఈనాడు ఆ విభేదాన్ని తుదముట్టించే మహదవకాశం లభించింది మీరు గావించిన వాగ్దానాలను ఆచరణలోపెట్టి, పైన చెప్పిన కర్తవ్యాలను నిర్వహించుతారని ఇండొనేషియా రిపబ్లిక్ ఆశించుతోంది. ఆ విధంగా మన రెండు దేశాల ప్రజలమధ్య ఐక్యతను - సామ్రాజ్యవాదులు విచ్ఛిన్నం చేయని ఐక్యతను - ప్రపంచ ప్రజాతంత్ర ఉద్యమములో, సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమంలో మహత్తర శక్తిగా పరిగణించే ఐక్యతను నెలకొల్పుదాం."



BC




కొయ్య తుపాకులు, బల్లెములు ధరించిన
యువజన సంఘసభ్యులు గెరిల్లా యుద్ధాన్ని నేర్చుకుంటున్నారు



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA104B131 |
| పుస్తకం పేరు | ఇండోనేషియా విద్యావిధానం |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 57 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C.P, BCP |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Habeeba |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | lakshmi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |